శ్రీశారదాంబాయై నమః






శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కీలక - చైత్రవైశాఖములు

సంపుటము 57 సంచిక 1






సంపాదకుడు

కాకరపర్తి కృష్ణశాస్త్రి.

శ్రీశారదాంబాయై నమః






శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కీలక - చైత్రవైశాఖములు

సంపుటము 57 సంచిక 1



సంపాదకుడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర,

బ్రాహ్మీభూషణ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

సంవత్సరమునకు చందా రు 3/-

విడిప్రతి 0-60 పైసలు

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు.

ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

కా కి నా డ

అ ధ్య క్షు లు

విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్

శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

అ భి న వ భో జ

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ;
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
7. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ;
8. శ్రీ వేదుల రామచంద్ర కీర్తిగారు, ఎమ్. ఏ; (ఆనర్సు)
9. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
   శ్రీ ఓలేటి వెంకట సుబ్బరాయశాస్త్రిగారు
10. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్;
11. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు

120/4

# విషయసూచిక

కీలక

వైశాఖములు

సంపుటము ౨౭

సంచిక ౧

# భా షా శా స న వి ధా న ము.

పూర్వకాలమునుండి నేటిదనుక భారత దేశమునం దెల్లెడల చతుర్వేదములు, నూటయెనిమిది యుపనిషత్తులు, ప్రస్థానత్రయము, మన్వాద్యనేకస్మృతులు, మంత్రానేకములు, నష్టాదశమహాపురాణములు, నష్టాదశోపపురాణములు, భారతభాగవతరామాయణాదులు, వేదాంత శాస్త్రములు, నాయుర్వేదము, ఖగోళభూగోళజ్యోతిష సాముద్రికవాస్తు శాస్త్రములు, వ్యాకరణతర్కములు, కావ్యనాటకాలంకార బాహుళ్యమును, నివియవియననేల సమస్త జాతిమతమహాగ్రంథములను భారతీయభాషాగ్రిగణ్యమగు సంస్కృతమందే విరచితములై జగద్విఖ్యాతి నార్జించుకొనుచున్నవి.

భరతఖండమందలి యాంధ్రకర్ణాటకతమిళగౌడ మహారాష్ట్రాది దాక్షిణాత్యరాష్ట్రములలోను, నౌత్తరాహుల బంగాళాది సకలరాష్ట్రములలోనుగల తత్తద్రాష్ట్రభాషలన్నిటియందునను సంస్కృతమున్నదనుట యనుభవైకవేద్యమే. వర్తమానకాలమున నౌత్తరాహులలో వ్యాప్తమైన హిందీయను భాషయందుగూడ గీర్వాణభాష యధికముగనే యున్నదనుట సత్యదూరముగాదు. భారతదేశమున నామరభాషకే ప్రాధాన్యముండుటచేతను, దదుత్తమతమభాషలో నపారములగు నద్భుతవిషయములుండుటచేతనే నేడనేకులు పరదేశీయపండితులు వేదములతో బాటుగ శాస్త్రములనుగూడ తమతమ భాషలలోని కనువదించుకొనుచుండిరని పత్త్రికలలో మనము పఠించుచునే యుంటిమి.

దక్షిణభారతమందలి రాష్ట్రభాషలలో నాంధ్రరాష్ట్రభాషయగు నాంధ్రభాషయందీ సంస్కృతమధికతరముగా నున్నది. మఱియు దక్షిణభారతమందలి హిందీభాషారచయితలు విరచించిన హిందీగ్రంథములయందును సంస్కృత మపరిమితముగ నున్నది. ఇంతియకాక పాశ్చాత్యదేశవ్యాప్తమగు నాంగ్లేయభాషకు మాతృభాష "లేటిన్" అనునది. లేటిన్ భాషకును భారతదేశమాతృభాషయగు సంస్కృత

మునకును సామ్యమున్నది. కావున నీయామరభాష జగద్విఖ్యాత మైనదనుట తిరుగులేనిమాట.

ఇక హిందీనిగూర్చి కొలదిగ విచారింతము. దక్షిణభారతీయ రచిత హిందీగ్రంథావళి సంస్కృతభాషాపూరితము. ఔత్తరాహకవి రచనలు అరబ్బి, ఉర్దూ, భాషాద్వయాతిమాత్రములు, సంస్కృత భాషాకలితములును నై యున్నవి. కాని హిందీయనునది యేరాష్ట్ర భాషయును గానేకాదు. ఇయ్యది యుత్తరభారతమున చాలవఱకు వర్తమానకాలమున వ్యాప్తమై యున్నది.

ప్రస్తుతకాలమున మాహిందీయే భారతీయప్రధానరాజభాషగా శాసనము నొనరింపవలయునని యౌత్తరాహులును, కొన్నివందల వత్సరములనుండి యాంగ్లేయప్రభవమున వ్యాపించి ప్రవృద్ధమైన యాంగ్లేయమే భారతరాజ్యభాషయై యుండకతప్పదని దాక్షిణాత్యులును పలుకుచు, వర్తమానప్రభుత్వమును పీడించుచు, పరస్పర వైరుధ్యముతో భారతదేశమున నశాంతి గల్పించుచున్నారు. ప్రస్తుతప్రభుత్వ శిక్షాచరణములచే నాందోళనములు శమింపకుండుటయేకాక మితిమీఱు చున్నవి.

కావున ప్రభుత్వము భారతదేశపూర్ణశాంతికై వివిధరాష్ట్రీయులలో బరస్పరైక్యమిత్వము సమకూర్చుటకై యీదిగువ సూచింపబడినరీతిగ భాషాశాసనము గావింపదగునేమో విచారించి కావింప నా యభ్యర్థనము.

ఆంధ్రుల కాంధ్రభాషయే ముఖ్యరాష్ట్రభాషగను, నాంగ్లేయపరిపాలనమునకుపూర్వము సర్వత్రవ్యాప్తమై, దేశీయభాషగ, రాజభాషగనుండిన సంస్కృతమునే దేశీయరాజభాషగను, ప్రాపంచికభాషగ నాంగ్లేయమును, నీ విధముగ భాషాత్రయములు బఠనీయములుగ శాసింపదగును. ఇట్లే తమిళ, కర్ణాటక, మహారాష్ట్ర, మళయాళాది దక్షిణభారత రాష్ట్రభాషలకు తత్తద్రాష్ట్రీయభాషాప్రాధాన్యము

గల్పించి,యున్నిటికినిమాతృభాషామతల్లియగు సంస్కృతమును దేశీయ రాజభాషగను, నాంగ్లేయమును ప్రాపంచిక భాషగను శాసింపనగును.

ఈ విధముననే యుత్తరభారతరాష్ట్రములకు వంగ (Bengal) పంజాబీ, రాజస్థాన్, గుజరాతీ, కాశ్మీరోత్తరప్రదేశమధ్యప్రదేశాద్యఖిలరాష్ట్రభాషల కమితప్రాధాన్యమొసంగి వానికిని దేశీయరాజభాషగ సంస్కృతమును, ప్రాపంచిక భాషగ నాంగ్లేయమును, నేతత్త్రి భాషల నేర్వ శాసింపనగును.

అపుడే దేశమందలి ప్రతిరాష్ట్రమునకు దత్తద్రాష్ట్రీయప్రధాన భాషను, పూర్ణ భారతదేశమునకు నేకజాతీయ రాజభాషను-నితఃపూర్వగతమగుటయేకాక ప్రాపంచిక భాషయగు దానికిని ప్రాధాన్యము గల్పించిన ట్లగును.ఇటు లొనరించినచో ప్రతిరాష్ట్రభాషకును ప్రాధాన్యముగల్గి సంస్కృము సర్వదా రాష్ట్రీయభాషాంతర్గతమగుటచే దాని వలన సమస్తరాష్ట్రీయులకును పరస్పర వైరుధ్యము తొలగి నైకమత్యముదయించును. కేవలము హిందీనే దేశభాషగ నొనర్చినచో దాక్షిణాత్యు లద్దాని నభ్యసించి యుద్యోగములందుటకు గొన్నివందల వత్సరములకాలములుపట్టును.ఔత్తరాహులే దక్షిణభారతోద్యోగములస్వీకరించి దాక్షిణాత్యులు నిరుద్యోగులగుటకు ప్రధానకారణు లగుదురు. అపుడాయౌత్తరాహదాక్షిణాత్యులలో వైరములధికములై దేశప్రశాంతినిభంగించుటయగును.సంస్కృతమున భారతజాతీయ రాజభాషగావించినచో తనుతమ భాషాంతర్గత మది యగుటచే దానినే రాష్ట్రీయులును నిరాకరింపరు. ఇపుడు దాక్షిణాత్యపండితరచనలలోగల సంస్కృతాధికత యౌత్తరాహుల కలవడుటచే హిందీ కమితవృద్ధియుగల్గి ప్రస్తుతమున్న హిందీభాషావిభేద మంతరించి యేకము గావింపగలదు. భారతదేశము చిరంతనకాలమునుండి సమస్తజాతిమతసంఘముల విధులు నేటికిని సంస్కృతముందే లిఖింపబడియుంటచే సంస్కృతవిద్వేషు లేరును గాకుందురు. సకలమతధర్మములకు స్థానము సంస్కృతమే- సకల

జాతిధర్మములకు నిలయము సంస్కృతమే- జర్మనీ, అమెరికా, రష్యా మున్నగు పరఖండీయులుగూడ సంస్కృతమునే గైకొని దానియందలి యఖండవిషయముల దమతమ భాషలలోని కనువాదము గావించుకొని గౌరవించుచున్నారు గాని మన రాష్ట్రీయ భాషల ననువదించుకొనుటలేదే-

జగద్వివిధఖండములయందును వ్యాప్తమైయున్న యాంగ్లేయ భాషయు భారతీయులకు పఠనీయమే. ఏమన, వర్తమానకాలమున ప్రభుత్వప్రేషితులగు మనభారతీయవిద్యార్థు లాంగ్లేయ భాషాకోవిదులగుటచేతనే కదా అమెరికా, ఇంగ్లండు, రష్యా మొదలగు వివిధదేశముల కేగి యాదేశములందలి యనేక కార్యపద్ధతుల గ్రహించి స్వదేశమున కేతెంచి యమితోన్నతి నందగల్గుచున్నారుకాదా- కావున నిదియు పఠనీయమే-

ఏతద్విషయములెల్ల ప్రభుత్వమే నిష్పాక్షికబుద్ధితో భారతీయుల కెల్లరకును విపులీకరించి ప్రచురించి రాష్ట్రభాషలకు సర్వసమ్మతమగు గీర్వాణభాషకును నఖిలఖండవ్యాప్తమగు నాంగ్లేయ భాషకును ప్రాధాన్య మొసంగి శాసనము గావించుట ధర్మమని సూచించుచు నింతటితో విరమించుచుంటిని.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, కాశరపర్తి కృష్ణశాస్త్రి.



# నన్నెచోడకవి చక్రవర్తి

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు.

## 1. కర్త; కథ

తెలుగులో కుమారసంభవ కావ్యమును నన్నెచోడమహాకవి 1 వ్రాసెను. నన్నెచోడుఁడు, నన్నయభట్టు వంటిపేర్లు మన కాలములో వాడుకలో లేవు. నన్ని (=మనోజ్ఞము) యను పదమునుండి యీయీ పేర్లు పుట్టినవి. నన (=చిగురు, మొగ్గ, పుష్పము), నన్న (=కుఱుచ) ననుపుకాఁడు నను పదములు నన్నిపదములకు సంబంధించినవె. అవి కవిత్వములో వాడఁబడుచున్నవి.

నన్నయ అనునది కుమారస్వామి (సుబ్రహ్మణ్యస్వామి) పేరు. కుమారస్వామి పసితనమందె తారకాసురుని సంహరించి దేశమును రక్షించెను. కాఁబట్టి యతనిపేరు, కీర్తి శాశ్వతమైనవి. అట్టి మహాత్కార్యమును బాలుఁడే నెఱవేర్చుటచేత, నాతనికి నెన్నియో ముద్దుపేర్లు బయలుదేరినవి.

ఎలం, నన్న, చిఱుత, బాల, కుమార మొదలైనవి బోలెడన్ని.

సంస్కృతములో కుమారసంభవకావ్యము పదునేడు సర్గలది. దానిలోని మొదటి యెనిమిదిసర్గలకు మాత్రమె మల్లినాథాదుల వ్యాఖ్యానము లుండుటచేత మిగిలిన సర్గలను కాళిదాసమహాకవి వ్రాయలేదను సిద్ధాంత మొకటి యున్నది. తెలుగు కుమారసంభవకథకుఁడున, తొమ్మిదవ సర్గనుండియున్న సంస్కృతకావ్యమునకును గొంత పోలికయున్నది. నన్నెచోడుని గ్రంథము ననుసరించి యెవరైనను సంస్కృతమునఁ గూర్చిరేమో! ఆకాలమందు తెలుగుదేశములో ఘన సంస్కృతపండితులకు కొదువలేదు. అది యీ వ్యాసమందలి ప్రధాన చర్చకాదు.

---

1. ఈ కవి కాలాదులను దెలుపుచు, నేను 'నన్నెచోడ దేవదేవకవి' యను వ్యాసమును, కిన్నెర 1954 ఏప్రిల్, మేసంచికలలో వ్రాసితిని. దానినిఁగూడ జదువుడని మనవి.

నన్నెచోడుఁడు తన కావ్యము, కాళిదాస మహాకవి గ్రంథము నకు నాంధ్రీకరణమని మెచ్చుటను జెప్పలేదు. కాళిదాసు తన కావ్యమును పౌరాణికఫక్కిలో వ్రాసినాడు. నన్నెచోడుఁడు వేఱొకపద్ధతిని గ్రహించినాడు. దండిమహాకవి (క్రీ.శ. 650) కావ్యాదర్శములో ప్రబంధ రచనకు నవసరమైన సూత్రములను గొన్నిటిని తెలిపినాఁడు. వాటిని గ్రహించి నన్నెచోడుఁడు కుమారసంభవకథను ప్రబంధముగా సంతరించినాడు. అంతేకాక దానికిఁ గొంత స్వతంత్రకల్పనను గూడ జేర్చినాఁడు.

కాళిదాసు వ్రాసిన కథలో విఘ్నేశ్వరజననము లేదు. నన్నెచోడుఁడు తన గ్రంథములో దానిని గూర్చినాడు. పార్వతీదేవి యొక్క పిండిబొమ్మను జేసి, దానికి ప్రాణము వోసి, విఘ్నేశ్వరుని సృష్టించిన దను సాంప్రదాయిక కథను నన్నెచోడకవి గ్రహించలేదు. పార్వతీ పరమేశ్వరులు గజరూపములను దాల్చగా గజవదనుఁడు జన్మించినాడని వ్రాసినాడు.[2] ఆకథ సుప్రభేదాగమములో నున్నది. క్రీ. శ. 1420 ప్రాంతపువాడైన నిశ్శంక కొమ్మనకవికూడ శివలీలావిలాసమను తెలుగుప్రబంధములో గజముఖుని జన్మను నన్నెచోడునివలెనె వ్రాసినాడు.

నన్నెచోడుఁడు వ్రాసినకావ్యములో వస్త్వైక్యము[2] (యూనిటి) లేదని విమర్శకుల యభిప్రాయము. దానికి కారణమేమి? కాళిదాసుని కుమారసంభవమును దృష్టిలో నుంచుకొని, తెలుగుకవిని చూచిన యెడల నట్లె కనఁబడును. నన్నెచోడుని రచనవేఱని తెలియగానె యట్టి యూహకు తావుండదు.

తారకాసురుని సంహారార్థమై కుమారస్వామి జననము సంస్కృత కుమారసంభవములో వర్ణింపఁబడినది. ఇంక తెలుగుగ్రంథవిషయమే మెమో చూచెదము.

---

2. రెడ్డిసంచిక (1947) పుట 347

నన్నెచోడమహాకవి తన గ్రంథములోని యంశములను ప్రారంభమందె. (ఆ 1 ప 68) సూచించినాడు. అతని యుద్దేశము కుమారస్వామి జననమొక్కటియె చెప్పుటకాదు. మొదట విఘ్నేశ్వరుని జననము, పిమ్మట కుమారస్వామి పుట్టుకయు తెలిపి, తారకాసుర సంహారమును వర్ణింపదలచినాడు. అంతేకాక కుమారీరత్నములగు సతి, ఉమా దేవుల జననముగూడ చెప్పదలచెను. ఇట్లనేకమంది జననములను, కథలను దీనిలో వివరించెను, బహువచనార్థములోనె కుమారసంభవమని పేరుపెట్టెను. ఆవిషయ మెఱిగినయెడల కథలోని వస్త్వైక్యము గోచరించును. అంతమంది మహాపురుషుల కథలుండుటచేత దానిని కావ్యమనియె కాక సంహితయనికూడ చెప్పవచ్చును. వేర్వేఱు కథల నొకేసూత్రముతో బంధించుటచేత నది ప్రబంధమైనది. అతనికి కొన్ని శతాబ్దముల పిమ్మట ప్రబంధమను పేరొకరకమైన రచనలకు రూఢిపద మైనది.

నన్నెచోడకవి తన కావ్యములో తనకాలమునాటి చరిత్రకథను గూడ అంతరార్థకథగా చేర్చినాడు. దానికి యవసరమగుటచేత నెయాతఁడు మహేశ్వరుని యిద్దఱుభార్యలు, వారిసంతానమును గుఱించి వ్రాయవలసిన యగత్య మేర్పడె నని తోచుచున్నది.

## 2. మల్లికార్జున ముని.

నన్నెచోడుని దైవము శ్రీశైలములోని మల్లికార్జునదేవుఁడు. ఆ చోడకవి కుమారసంభవగ్రంథమున తన గురువైన మల్లికార్జున మునికి నంకితమిచ్చెను. మల్లికార్జున లేక మల్లయమునిరొక్క మత మేది? కొందఱు విమర్శకులకు జంగము మల్లికార్జునుఁడు లేక జంగము మల్లయ్య యెక్కడ పట్టినను దర్శన మిచ్చుచుండును. కాని తెలుగు

2. తెనుగుకవుల చరిత్ర- నిడదవోలు వెంకటరావుగారు 1953 పుట 204; కుమారసంభవతత్త్వము- వేదాల తిరువేంగళాచార్యులు గారు 1965, పుటలు 102, 277, 279.

కుమారసంభవమును వెదకిచూచినచో జంగమ మల్లికార్జున లేక జంగమ మల్లయ్య మాత్రమె కనఁబడుచున్నాడు.

నన్నెచోడుఁడు తన దేవునియొక్క యపరావతారమె తన గురువని నమ్మెను. గుడిలోని మల్లికార్జునలింగము స్థావరలింగము. ఆ దేవుఁడె "జగంబుల బ్రత్యక్షంబై ప్రవర్తిల్లుట జంగమ మల్లికార్జున దేవుఁడు (ఆ 1 ప 58), జంగమలింగం బగు మల్లికార్జునుఁడు (ఆ 1 ప 15)" అయ్యెను. మల్లికార్జున గురువుయొక్క పేరు నుచ్చరించినప్పుడెల్ల నిర్వచనమునవలె పైపద సంఘటనంతను దెలుపుచుండుట సాధ్యముకాదు.[3] కాబట్టి సంగ్రహముగా నతఁడు జంగమ మల్లికార్జునుఁడు లేక జంగమ మల్లయ యయ్యెను. ఆ కావ్యములో మల్లయ జంగము అను పేరు ఒక్కసారి కనబడినను కృతకృత్యులమై యుందుమని తలచిన[4] విమర్శకులు లేకపోలేదు. కాని యేమిచేయగలము!

ఇక్కడ నొకచిన్నవినోదము ముచ్చటింపనగును. ఒక యాచారిగారి పేరులో అవ్వల, తాతల, ముత్తవ్వల, ముత్తాతల, దేవతల నామములన్నియు కలియుగా నది చాంతాడంత పొడుగైనది. అంత పేరును పెట్టి పిల్చుటసాధ్యమా! అందుకని అందలి పొడియక్షరములను గూర్చి పిలువఁదలచిరి. కాని యదికూడ సాధ్యముకాకపోగా, చివరకు వర్ణమాల యాచారియని పిలువసాగిరి. ఈనాటి పేర్లలోని సంగ్రహకరణ మందఱకు ననుభవములోని విషయమె.

---

3. ఏదియొ యొకపదము కనఁబడగానె నిర్ణయమునకు వచ్చుట యొక్కొక్కప్పుడు మేలుకాదు. ఎఱ్ఱాప్రగడ మహాకవి నృసింహపురాణములో తన తండ్రిని "ఆరాధ్య సర్వజ్ఞాంకు" (ఆ 1 ప 26) అన్నాడు. దానినిబట్టి దానికి పీఠిక వ్రాసిన పండితుఁడు "ఇతఁ డెఱ్ఱనతండ్రి సూరన ఆరాధ్యుఁడు" అన్నాఁడు. దానినిబట్టి ఎఱ్ఱన తాతముత్తాతలు అద్వైతులుకాగా, ఎఱ్ఱన్న తండ్రి మాత్రము ఆరాధ్యుఁడై, మరల నతనికొడుకు అద్వైతియయ్యెనను విపరీతార్థము పుట్టుచున్నది. ఆరాధ్యసర్వజ్ఞుఁడనగా పూజింపబడు సర్వజ్ఞానియనిమాత్రమె భావము.

4. "ఇతనిగురువు మల్లయజంగము" (కుమారసమ్భవతత్త్వము, పుట 244.

మల్లికార్జునముని పురుషోత్తముఁడు (విష్ణువు), బ్రహ్మ ఆ 1) ప 58) కూడ. అప్పటికి వారందఱును జంగములేనా! అంతేకాదు. ఆ గ్రంథములో జంగమనగములు, జంగమవృక్షములు, జంగమలతలు ఎన్నెన్నో! అవియన్నియునుగూడ వీరశైవమతమును బుచ్చుకొనలేదు కదా! కదలుచున్నవాటికి ఆకవి జంగమశబ్దమును జేర్చినాఁడు. అంతే!

మల్లికార్జునుఁడే జంగమైనపక్షమున నా గ్రంథములో వీరశైవ పరిభాష యుండకతప్పదు. అనగా- బసవన, లింగాయతులు, వీరశైవులు, వారిభక్తులు; లేక పండితారాధ్యులు, వీరమాహేశ్వరులు వగైరాలు. కాని మచ్చునకొకపదముగూడ కనఁబడదేమి ? ఆ గ్రంథము నకును వీరశైవమతమునకును కొన్ని శతాబ్దముల యెడమున్నది. రామాయణములో రాముని తోకయని చదివి, రామునికి తోకయున్నదని పిడివాదము చేసి, రాముని తోకకోసము రాముని విగ్రహము లను వెదకినట్లున్నది, 'జంగము'కోసము వెదకులాట.

మల్లికార్జునముని విప్రుఁడు, వేదశాస్త్రవేత్త, కాంతాసంయోగ వియోగసంత్యక్తుడు (ఆ 6 ప 169). ఆ వరముని తత్త్వమును అన్యాపదేశముగా కవి యెంతచక్కఁగా చెప్పినాడో చూడండి-

క. మదనోత్సవ మధ్రువ మని,
సదమలమతి బంధుజీవసంఘం బచిరా
స్పదమని, యన్నిటి నొకయలి
వదలి, జపాసక్తినిలిచె వరమునివోలెన్.

(ఆ 9 ప 302)

అటువంటి మహామునియొక్క భక్తుఁడైన నన్నెచోడుఁడుకూడ సామాన్యుఁడు కాఁడు- "పవిత్రీకృతదేహుఁడు వివిధయజ్ఞములన్" (ఆ 1 ప 55). అయితే యశ్వమేధయాగము దాక పోకపోవుటమే మేలు.

శి. మ త ము.

కుమారసంభవ రచనాకాలమున నున్న శైవమత శాఖలన్నియు నా గ్రంథమందు వివరింపఁబడినవి.

కాయగూరలు తినువారి కేకాని మద్యమాంసములను సేవించు వారికి ఈశ్వరుఁడు లేఁడా? ప్రజలు తమతమ యంతస్తులను, సంస్కారములను బట్టి, సత్త్వ, రజ, స్తమోగుణములలో నీశ్వరుని భావించుకొని భజించుచుండిరి. కాఁబట్టి యాగ్రంథములో నానావిధశైవములు ను గనఁబడును.

మానవసంఘములోని కడపటి యంతస్తయిన యడవిజనుల కొలువులో నొక భాగము-

చ......శబరకామిని పెక్కులు రాగముల్ మదోత్కటముగఁ బాడ
జుట్టినమృగంబులు, సోమమనుష్యరూపధూర్జటిముని ...
మఱిరెుక వర్గమువారి యీశ్వరారాధన—
...మధుపానగోష్ఠికింజొచ్చి మండలార్చనదీర్చి...

మ. శివుగౌరీసహితంబు సన్మనములం జించించి...
...యాసనపాత్రిల్ సతులర్థి నెత్తికొని
యాస్వాదించి మోదించుచున్

వ. అనేకవిధమాంసాపదంశకంబు లాస్వాదించుచు.

తరువోజ...శంకరు సంకమాలికలం...
...పెక్కువిధములఁ బాడి
వినుతించి రింతు లా విశ్వేశు నీశు.

(ఆ 9 వ 127—135)

మఱికొందఱు పూజావిధానమున నీకిరింది రూపమును నిర్మించుకొందురు-

మ. హరికంకాలము చేతిముద్ర, దివిజేంద్రాస్థుల్ సుభూషావళుల్
గరళం బభ్యవహార, మంతకతనుక్షారంబు మైపూఁత,
పంకరుహాసనశిరఃకపాల మురుభిక్షాపాత్రిగా విశ్వసంహరు......
(ఆ 4 ప 77)

దానిని కాపాలికమని కొందఱు విమర్శకులును[5] కాదని మఱి కొందఱు ననుచున్నారు.

పార్వతి తపస్సుచేయుగా శివుడు రాజసరూపములో దర్శనమిచ్చెను. ( 7 ప 57)

మునిపల్లెలోనివసించు బ్రాహ్మణుల పూజావిధానము బరిపూర్ణమైనది. అది కర్మరహితమైన యోగమార్గము మాత్రమె.

ఎత్తుగీతి. నోటువడు శరీర మొల్లనన్ వాడు దే
హేంద్రియంబు లిచ్చలేక చలువు
గర్మవిహిత యోగనిర్మలచరితుండు,
పురుషుఁడేల క్రియల బొందు నెందు. (ఆ 5 ప 65)

ఇంద్రియసౌఖ్యమట్లు నిరసింపఁబడినది-

క. అనుభవింపతనికి, యటమఱివిషయముల్
విడుతు నని తలంచు వెడగుఁదలఁపు,
లఖిలశిఖిశిఖాళియందింద నాజ్యముల్
గమియవైచి యార్వఁగడఁగునట్లు. (ఆ 6 ప 69)

సగుణరుద్రారాధనపిమ్మట, నిర్గుణరుద్రుని ధ్యానింపవలెను. అట్లు ఇంక నొక్కటే మార్గమున్నది-

చ. తలఁకఱనిల్చి శాంత మెద దాల్చి, మమత్వము దాల్చి, ధైర్యమి
ట్టలముగఁ బెంచి, మోహము లడంచి, యఘావలి ద్రుంచి, కోర్కెయ
గ్గలముగ మాల్చి, యీషణల గ్రాల్చి, సదాశివు గొల్చి, యాత్మలో
పల ననురక్తి నిశ్చలత భక్తిఁ దలంచిన ముక్తి చేకుఱున్.

5. 'ఇది కాపాలిక వ్రతమె కాని కాలాముఖము కాదు.' (కుమార సంభవ తత్త్వము, పు 243)

తరువోజ. హృదయాంబుజములోన నెప్పుడు బాయ
కేర్పడి వెలుఁగు మాహేశ్వరురూప
......చిత్తంబు లయంబుగావించు
......నిర్వాణపదవి నాదియు. (ఆ 6 ప 70,71)

క. తానసమస్తములోఁ, దన
లోనన సకలంబు గనుట, లోనును వెలియుం
దానయయి, తనకువేఱనఁ
గా నేమియులేక తానకలిగి వెలుంగున్. (ఆ 6 ప 73).

అది నిరాకారమైన, నిర్గుణమైన శివరూపము. అట్టి యద్వైతస్థితికోసము బోధింపబడు విద్య యుదాత్తమైనది. "వేదశాస్త్రపురాణాగమసార వృత్తాధ్యాత్మశాస్త్రములు (ఆ 6 ప 78), మిథ్య (ఆ 6 ప 77), శైవాగమమంత్రధ్యానపత్రములు (ఆ 6 ప 81), నిర్వాణము (ఆ 6 ప 71) బోధింపఁబడుచుండినవి. మహేశ్వరుఁడు తన కుమారునికి వేదశాస్త్రాగమపురాణేతిహాసకథా, బృహత్కథలను, పరమాత్మజ్ఞానమును (12 ప 215) నేర్పినాడు. అది శివాద్వైతము మాత్రమె.

ఇంక మల్లికార్జునముని విషయ మేమనగా, అతఁడు "అమృతాంశుభూషణావతారంబు (ఆ 1 ప 56), నరరూపధారియై జగంబుల సంచరించు మల్లికార్జునదేవుఁడు, అనూనవైరాగ్యనిరతుండు, పురుషోత్తముండు, బ్రహ్మ (ఆ 1 ప 58) జగద్గురుఁడు (ఆ ప 60), బ్రహ్మర్షి (ఆ 1 ప 66) యును. అట్టి అద్వైతస్థితి చిల్లర మతాచార్యులకుఁ దెలియదు. సదాశివుని భజించుచుండిన సాత్త్వికకి, రాజస, తామసవిధానములలో సాత్త్వికవిధానము శ్రేష్ఠమైనదని వేఱే చెప్పనక్కఱలేదు. ఆ మార్గముననె శ్రీకృష్ణుఁడు భగవద్గీతలో నుపన్యసించినాడు.

కుమారసంభవకావ్యములలోఁ జెప్పఁబడిన శైవమతశాఖల విషయ మెఱుఁగని వారి విమర్శలను చూచెదము.

'వీర' శబ్దము కనబడినంతమాత్రమున గంతువేసి వీరశైవమత మని బెదురుట, ఎఱ్ఱగుడ్డనుచూచి యెద్దు బెదురుట వంటిది. విదానించి చూచినయెడల నందులో భయమును గలిగించు నంశమేదియును గనఁబడదు. "వీరసన్యాసవిధి (ఆ 11 ప 53)యను పదబంధములో నున్నది వీరశైవముకాని వీరవైష్ణవముకాని కాదు. వీరపురుషులు (=యుద్ధభటులు) తను యాలుబిడ్డలను త్యజించి యుద్ధమునకుఁ బోవుట వీరసన్యాస మనఁబడు చున్నది. యుద్ధములోఁ జచ్చినవారు వీరస్వర్గమును (దీనిని మరల వీరశైవస్వర్గమని బెదురుదురుకాబోలు!) అందుకొను చున్నారు. బ్రతికి బైటపడ్డవారు మరల కొంపలను జేరుకొను చున్నారు.

చోడకవి రాత్రికాలమును వర్ణించిన పద్యములలో మతసంబంధమైన పదజాలమేదియును లేదు.[6] జారచోరాదిగూఢాచారులు (ఆ 8 ప 100) జారపతిరాగరుతిగని, జారపతి రావించెన్ (ఆ 8 ప 102,103) అనువానిలో దుర్మార్గుల వర్తనలు దెలుపఁబడినవి. గూఢాచారిలో విలేఖకుని పొరపాటువల్ల నొక యాచారి కనఁబడుచున్నాడు.

ఈక్రింది చరణములో [7]శాక్తేయమత ముందని విమర్శకుని తలంపు.

శా. శాక్తేయా! మునిచింత్యమాన భరతా సంతాపహా! సద్యశా!
(ఆ 12 ప 40)

అవి విష్ణువు మొదలైనవారు కుమారస్వామి చుట్టును మూగి, చేసిన సంబోధనలుమాత్రమె. శాక్తేయ యనగా శక్తి (పార్వతి) యొక్క కుమారుఁడనియే యర్థము.

ఈకావ్యములో [8]విమర్శకుఁడు, కాశ్మీరదేశవాసియై, యతిప్రాచీనుఁడగు సోమదేవుని పేరుందని (ఆ 1 ప 84) లోని 'సోమదేవ' పద

6. కుమారసంభవ తత్త్వము పు 13 - 2-5.
7. కుమారసంభవతత్త్వము. పు. 301
8. కుమారసంభవతత్త్వము పుటలు 254, 292, 301.

మును సూచించెను. కాని యట్టిదేమియు కనఁబడదు. ఆ పద్యములో "హిమదామసమస్తక! సోమదేవ!" యని శివునిగూర్చిన సంబోధనలు మాత్రమె యున్నవి. విమర్శకుఁడుచేసిన కాశ్మీరశబ్దపరిశోధనగూడ నట్లెయున్నది. కాశ్మీరుఁడగు నీశుగనుడు" (ఆ 6 ప 55) అను పదసంపుటి యీ సీసపద్యములోని మిగత భావముతో నెంతమాత్రమును నతకదు. అది వ్రాయసకాని పొరపాటు మాత్రమె. "సస్మేరుఁడగు నీశు" అని దిద్దుకొనవలెను. అర్థములేని పాఠమును బట్టుకొని చేసిన కాశ్మీరసిద్ధాంతము త్యాజ్యము.

4. కవి కా ల ము.

నన్నెచోడుఁడు నన్నయభట్టుకంటె పూర్వుడని స్థాపించెగి యంశములు బోలెడన్ని యున్నవి.

నన్నెచోడకవి తన కాలమునాటి కవిత్వములో రెండు విధానములు- మార్గ, దేసి- నున్నవని తెలిపినాను. అదేపరిభాషను పూర్వకవులైన అమోఘవర్షుఁడు (క్రీ. శ. 840), [9]పంప (941), రన్న (990) యుపయోగించిరి. 1145 నాటిదైన శాసనములో భీమయపండడు ఆపదములను స్పృశించుటయే కాక, అట్టి రచనను 'అద్యులు' అనగా పూర్వులు చేయుచుండిరన్నాడు.[10] విమర్శకుఁడు మార్గ, మార్గము శబ్దములు వేఱనుకొనుట పొరపాటుమాత్రమె. ఆపదము రెండురూపములలోను వాడఁబడినది.

అటుపిదప నన్నయభట్టు కాలమునుండియు నా విభజన మారిపోయినది-ఆశు,మధుర,చిత్ర, విస్తరములు-అనునాలుగైనవి. ఆమాటలలో[11] చిల్లరమార్పులున్నవి. నన్నయ కి సమకాలిక గ్రంథమగు అప్పి

9. ఆంధ్రకర్ణాటక సారస్వతములు:-నిడదవోలు వేంకటరాయ రచితము 1962, పుటలు 83, 90.

10. "'మార్గ,మార్గము' ఈ రెండుపదములకునుగల విభిన్నార్థములను గుర్తింపకపడు భ్రమమాత్రమే." ఈ. సం. తత్త్వము, పుట 58.

11. ఆంధ్రకర్ణాటక సారస్వములు, ని. వెం. పుట 103.

లంగకారంకై (తమిళగ్రంథము)లో గూడ నట్లున్నది. 1125 నాటివాడైన వెన్నెలకంటి అన్నయకవి ఒక్క తెలుగులోనే కాక యట్టి విభజన యన్ని భాషలలో నుందని యిట్లు ధ్రువపఱచినాడు.

సీ. అష్టభాషల మధురాశు విస్తరచిత్ర
            కవితలు చెప్ప సత్కవులు మెచ్చ.

పాల్కురికి సోమనాథుఁడు వృషాధిపశతకములో "రుచిర దేశి మార్గమధురస్వర కృతసుధాతరంగిణీ" అని సంగీతమును గుఱించి తెలిపినాడు.

నన్నిచోడుఁడు వాడినవస్తుకవిత, జానుకవితశబ్దములను ప్రాచీన కవులు మాత్రమే వాడిరి.[12] పూర్వకన్నడకవు లుపయోగించిరి. చోడకవికి సమకాలికుఁడైన రేచన "వస్తుకవిజనాశ్రియుఁడ" (జాత్యధికారము)నని చెప్పకొన్నాఁడు. వస్తుకవిపదము 1300 నాటికికూడ నున్నది. మంచెన కవిశ్లేషలో నిమిడ్చి యిట్లు వ్రాసినాఁడు.

క. సొమ్ములలో ముప్పోచ్చరుప్ప, జ
    గమ్మెల్లను జోడుముట్టగాఁ జేయును శ్లా
    ఘ్యమ్మగు వస్తువగుటను,
    కమ్మని కనకంబుగాదె కవితతలంపన్.

(కేయూర బాహుచరిత్ర ఆ 1)

చోడకవియొక్క సంస్కృతకవి స్తుతి యుద్భటునితో ముగిసినది. అటుపిమ్మట మాత్రము ప్రసిద్ధసంస్కృత కవులు లేరా? అది యట్లుండగా నతఁడు (గుణాఢ్యునిదైన) బృహత్కథను (ఆ 12 ప 215) పేర్కొన్నాఁడు. అది బృహత్కథామంజరి కాదు బృహత్కథయె. ఆ గ్రంథము క్రీ. శ తొమ్మిదవ శతాబ్ది ముగియునాటికి నశించినది. చోడకవి దానిని చదివినవాఁడగుటచేత నతఁడు క్రీ. శ. 850 ప్రాంతపువాడను సిద్ధాంతమును బలపఱచుచున్నది.

---

12. ఆంధ్రకర్ణాటక సారస్వతములు, పు 89-91.

నన్నెచోడుఁడు బాణుని హర్షచరిత్ర, కాదంబరీపీఠికల ననుసరించియే కుకవినిందను గావించినాడు.

షష్ఠ్యంతములను నన్నెచోడుఁడు వ్రాసినాడు. ఆ సంప్రదాయము సంస్కృతములోను, కన్నడములోనుగూడ కనఁబడదు. రేచన యొక్క గ్రంథములో సంజ్ఞాధికారములోని 6వ పద్యములో సూచింపబడినది. 1108 నాఁటి యొక తెలుగుపద్యమయశాసనములో గోచరించుచున్నది. అది యాచారములో నుండుటచేతనే శాసనములోనికిగూడ నెక్కినది.

చోడుఁడు బంధ, గర్భకవిత్వములవంటి భాష మొగ్గలను వేసినాడు. అతఁడు తన కావ్యములో దండికావ్యాదర్శసూత్రముల ననుసరించినాడు కదా! దాని కదియొకకారణము. భారవిమహాకవియొక్క పదునైదవసర్గలో నట్టిమొగ్గలున్నవి. కాని అది కవిత్వమనిపించుకొనదు. కావున నన్నయతిక్కనాదులు వాటికి చోటివ్వలేదు. కృష్ణరాయల కాలమునుండి యవి బాహాటమైనవి. పోనుపోను తెలుగుకవిత్వము నేతిబీరకాయమైనది. భాష మొగ్గలుచూచి చోడుఁడు.[13]అధునాతనుఁడని భ్రమపడుచున్నారు. కాని యవి వారికి నుపయోగపడవు.

కుమారసంభవములో 'శ్రీరామేశగవీశ్వరాదు' (ఆ 10 ప 90) లను సమాసమును తప్పుగా రామేశకవియని భావించి, యతఁడొక శాసనములోని రామేశపండితుఁడనుచున్నారు. కాని యాపండితుఁడు కవిగాడు; కాలాముఖమతస్థుఁడు. కాఁబట్టి చోడకవి కాలనిర్ణయము నకు పనికిరాదు.

క. తలవు, బొలవు. గడుఁగొను
రాలవు, కోమలివి, ముద్దరాలవు. దగమం
చాలవు, జేలవుగాకిది
కాలమె తపమున కపారకాంతారములన్.

(ఆ 6 ప 15)

13. కుమారసమ్భవవిమర్శము, పు. 149, 203, 211, 212.

'పంచాలవు' అను రసహీనపద మొకటి కనఁబడుచున్నది, దానిని [14]విమర్శకుడు 'మాంచాల' పదముగామార్చి, పల్నాటిపేరుఁడైన బాల చంద్రుని భార్యయని వ్యాఖ్యానించి, కుమారసంభవము క్రి. శ. 1178 కి పిమ్మటి రచనయని వాదించుచున్నాడు. అది యసందర్భముగా నున్నది. మాంచాల పెండ్లియైన పడుచు. కన్నెల సందర్భములో నామెను దల పెట్టుట సబబు లేదు. అయితే యాపద మేమి? ఆగ్రంథములో పురుషుల సందర్భముగా 'పాంచాలుఁడు' (ఆ 8 ప 145,169)అను పదము అనేక సార్లు వాడఁబడినది. అట్లై స్త్రీ పరముగా వాడఁబడిన "పాంచాలవు" అను పదము మాత్రమె. విలేఖకుని పొరపాటునుబట్టి కాలనిర్ణయము నకు బూనుకొనరాదు.

ఆ గ్రంథములో విష్ణు వెట్లు సామాన్యుఁడో, లక్ష్మియు నట్లె; పిదప కాలములో వారిదశ మారినది.

నన్నెచోడుని కాలనిర్ణయమునకొక కన్నడశాసనము కొంత సాయపడుచున్నది. త్రైలోక్యమల్లుని కాలమందలి యొక జైనమఠములో (క్రీ శ. 1124) శాసనములో చోడకవి రచించిన "హరహాసా"పద్యము (ఆ 4 ప475) యొక్క నకలనదగుపద్య మున్నది. దానినిబట్టి చోడకవి యంతకుపూర్వుఁ డగుచున్నాడు. ఆశాసనముకొఱకై చోడకవి వెదకు కొనుచుఁ బోయి, దానిని కాపీకొట్టినాడనుట యసందర్భము. మల్లికా ర్జునముని సుప్రసిద్ధ తమిళభక్తుఁడైన మాణిక్యవాచకర్ (క్రీ, శ. 850 ప్రాంతము)తో వాదించినాడని చెప్పబడుచున్నది. అది కాలనిర్ణయ మున కనుకూలముగా నున్నది.

క్రీ. శ. 950-958 మధ్యవాఁడైన[15] బద్దెనకవి 'నన్నెచోడనరేంద్ర' యను బిరుదును నీతిసారగ్రంథములోఁ దెలుపుకొన్నాడు. అప్పటికి చోడుఁడు దానికి పూర్వుఁడే కదా!

14. కుమారసమ్భవవిమర్శనము, పు 231, 235, 304.
15. నాబట్టెనకవి వ్యాసమింకను అముద్రితము.

కుమారసంభవములోని [15A]యంతరార్థకథ క్రీ. శ. 850 నాటి చారిత్రకదశను సూచించుచున్నది. దానినిగుఱించి మఱిరెండుమాటలు ముందు చెప్పఁబడును.

తెలుగుగడ్డలోఁబుట్టి ఏమాత్రము ఉపపత్తియున్న కవియుగూడ సామాన్యముగా నన్నయభట్టుగారిని స్తుతింపక కలమును చేతబట్టలేదు. ఆమహాకవికి పిమ్మటివాఁడై నయెడల చోడుఁడుకూడ నా పనియే చేసి యుండునుకదా!

### 5. ఉద్భటుని గూఢత్వము.

ఉద్భటునిగుఱించి చెప్పఁబడిన పద్యములో (ఆ 1 ప 21) మూఁడు నాల్గు చరణములు మానవల్లివారిప్రతిలో నొకలాగునను, వావిళ్లవారి దానిలో నింకొకలాగున నున్నవి-

క...గుమారసంభవము సాలంకా
రము, గూఢవస్తుమయకా
వ్యము. (మానవల్లివారిది)

క...కుమారసంభవమ్ము నలంకా
రము గూఢవస్తుమయ కా
వ్యము (వావిళ్లవారిది)

ఆ రెండు ప్రతులలోని పాఠమెందుకు భేదముగానున్నదో! ఏదయి నను వావిళ్లవారి ప్రతిలోని వాక్యము దోషసహితముగా నున్నది. అందుచేత నాపదము 'గూఢ'కాదు 'గూడ' యని చెప్పి, ఉద్భటుని గ్రంథములో గూఢత్వములేదని [16]వాదించుటకు వీలగుచున్నది. నిజ ముగా ఉద్భటుని గ్రంథములో రెండు గుణములున్నవని చెప్పుటయే కవియొక్క యుద్దేశము. తప్పుడుపాఠము తప్పుత్రోవలకు మాత్రమె తీసుకొనిపోవును.

---

15 A. అంతరార్థ కథవిశేషములను దయచేసి వెనుక చెప్పిన కిన్నెరలోని వ్యాసములో చూడండి.

16. కుమార సమ్భవతత్త్వము, పు 17.

## 6. నన్నెచోడుని గూఢత్వము.

తెలుగు కుమారసంభవములో గూఢత్వము లేదని[17] కొందఱి యభిప్రాయము, కాని యది సత్యమునకు విరుద్ధముగా నున్నదని వారి యన్వేషణమే చెప్పుచున్నది. నన్నెచోడకవి తన గ్రంథమును "గురువుకు, నిష్టదైవమునకు, గూర్చుని జేశునకు" (ఆ 1 ప 50), [18]అముగ్గుఱకును గలిపి కృతినిచ్చినట్లుగా వ్రాసినాడు. దానిలో నిజేశుఁడు అనగా రాజు, ఎవరు అనునది సమస్య. దానికి ననేకమంది యనేక విధములుగా సమాధానము లిచ్చినారు. ఆ అన్వేషణమే రుజువుపఱచుచున్నదికదా యందలి గూఢత్వము. అట్లె 'అన్యతారకకవి' పద్యములలోని యాకవి యెవ్వఁడని వెతుకఁబోవుటకూడ గూఢత్వము నంగీకరించుటయె. విమర్శకునియూహ యతఁడు తిక్కన కావచ్చునట! తిక్కన పేరునకును తారకవి పేరునకును సామ్యమేమిటో! [19]చివరకు విమర్శకుఁ డిట్లు తేల్చినాడు. తిక్కనకు నన్నెచోడుఁడు కుకవి. నన్నెచోడునకుఁ దిక్కన కుకవి. నిజముగా నిది విలువలేని విమర్శనమె!

కుమారసంభవకావ్యములోని (ఆ 1 ప 37, 40) పద్యములను గమనించినయెడల నదియొక [20]యంతరార్థముగల కావ్యమనిపించును. దానిలో చోడకవి సమకాలిక చరిత్రమును సూత్రమువలె కూర్చినాడు. దానిని సూచించెదను. గుణగవిజయాదిత్యుఁడు (కుమారుఁడు), అమోఘవర్షుఁడును (తారకవి, తారకాసురుఁడు) గావించిన యుద్ధమును

17. కుమార సమ్భవతత్త్వము పు 30, 140, 148, 251, 296, 297.

18. ఆ అంశమును కనిపెట్టినవారు దేవరకొండ వెంకటకృష్ణారెడ్డిగారు.

19. ఈ విమర్శకుని వ్రాతలు భ్రమించి రాగమునఁబడినవి. కుమారసమ్భవతత్త్వము, 129, 147 పుటలలోని వాక్యములు అసత్యముగా నుండుటచేత నుట్టంకించుటకు నర్హములుగా లేవు.

20. చాగింటి శేషయ్యగారు ఆంధ్రకవితరంగిణి 1946 (సంపుటము1 పు 173, 174) లో తారకవికి సంబంధించిన పద్యములలో శ్లేషగలదనియు, సందేహో కథ యున్నదనుట సత్యముగా గనఁబడుచున్నదనియు వ్రాసినారు.

ఆనాటి దేశచరిత్రయు, ఆ గ్రంథములోని యంతరార్థకథ. అట్టి అంత రార్థములు కాళిదాసుని కావ్యములలోను, మాళవిక, కమలినీకలహంస నాటకము, హర్ష చరితాదులలో నున్నవి. పంపాదులగు కన్నడకవు లట్లొనర్చిరి. ప్రాచీన సంప్రదాయముప్రకారము పోయిన చోడునిలో గూడ నదియె గోచరించుచున్నది.

7. ప్రాతవడ్డ మాటలా?

సంస్కృతభాష ఇటీవల నిత్యవ్యవహారములో లేనందువల్ల దాని లోని పదముల ప్రయోగములో ప్రాత, క్రొత్తలు తేలవు. కాని వ్యవ హారమందున్న తెలుగులో కొన్నిమాటలు వాడుకలోనుండి తొలగు టయు, క్రొత్తవి వచ్చుటయు జరుగుచుండును.

చోడకవివ్రాసిన గ్రంథములో ప్రాతవడ్డమాటలున్నవని యొక వింతవాదన గలదు. ఏకవియైనను సాధారణముగా తన కాలమునాటి పదముల నుపయోగించుచుండును. ఈనాటి మనగ్రంథములోని వ్యావ హారికపదములు కొన్నిశతాబ్దములవారికి ప్రాతవడ్డమాటలవలె కనబడు బడుటలో నాశ్చర్యములేదుకదా. నన్నెచోడుఁడు తనకాలములోనున్న తెలుగునుమాత్రమె వాడినాడు.

చోడుఁడు నిజముగా ఒరేయూరిపురము రాజధానిగా రేనాటిని, పాకనాటిని బాలించినాడు. అది వట్టిబిరుదు కాదు. అతని రాజ్యము సరి హద్దులకు పడమట కన్నడభాషయు, దక్షిణమున తమిళభాషయు నున్నవి. సరిహద్దుప్రాంతములలో నుభయభాషల అనగా తెలుగు, మఱియొక భాష– పదములు చలామణిలో నుండునని సరిహద్దుప్రాంత ములలో నున్నవారికి అనుభూతి. ఆప్రాంతపు రచనలలో నామాండలి కములు గనఁబడుచుండును. అవి యన్యదేశ్యములుగా గనఁబడవచ్చు ను. పైగా చోడకవి (క్రీ. శ. 850) నాటిభాష ఈనాడు మనకు ప్రాత దిగాకాక, క్రొత్తదిగా కనబడునా? క్రీ. శ. 1000 నాటిదైన గూడూరు శాసనములోని కొన్నివాక్యములె మనకు బోధపడుటలేదు. దానిలో

శాసనకవి వ్రాతవద్ద మాటలను ఏర్చి వ్రాసినాడా ? కాఁబట్టి చోడకవి తనకాలపు భాషనుమాత్రమె వాడినాడని తెలుసుకొనవచ్చును. తిక్కనమహాకవి తాను వాడుకలోలేని పదముల నుపయోగించనని ఆత్మహితము చెప్పుకొన్నాడు. అది సబబేకదా !

8. లేఖకుని తప్పులు.

కుమారసంభవములో లేఖకుఁడు గావించినతప్పులు కొన్నిటినిఁ జూచితిమి. అన్నిటిని జూపుట ఈవ్యాసము పనికాదు. లేఖకునిదోషము మఱియొకటిమాత్రమె చూచెదము.

అర్ధనారీశ్వరరూపమును వర్ణించెడి యసమానపద్యములో (ఆ 1 ప 210) 'మానితముగ నిరంతరమదనసుఖము' అను చరణములో నత కనిమాట 'మదన'యనునది. శివశక్తులుకోరినది నిరంతరమననసుఖము మాత్రమె. కావున నాపదము నట్లుదిద్దుకొనవచ్చును. చోడకవిగ్రంథ ప్రారంభములోనె పార్వతిని గుఱించి యిట్లు వ్రాసినాడు.

"మును దర్పకునోర్చిన వీరరాగి, చిద్ఘనతను నీశునాత్మ శుభగస్థితిమైమెయి నర్ధనారిఁ జేసిననగజాత"(ఆ 1 ప 10).కవియొక్క యుదాత్త భావమును గ్రహించవచ్చును. శివశక్తులు కుమారస్వామి జననము కోసము ద్వంద్వస్వరూపులైరి. పిమ్మటనేకరూపమును వహించిరి.

9. ప్రాచీనత.

నన్నయభట్టుకి పూర్వమున నున్న తెలుగుకవులపేర్లు కొన్ని యీనాడు వెలుగులోనికి వచ్చినవి,[21] పద్మకవి (పంపకవి క్రీ. శ. 941) గజాంకుశుఁడు (945), సర్వదేవుఁడు (పొన్నకవి 953). అంతేకాదు, [22]వేమన,[23] రేచన, బద్దెనలుగూడ నన్నయభట్టుకిపూర్వపువారె. శిలా శాసనాదులనుండి తెలుగుకవిత్వపు ప్రాచీనత యిదివఱకె విశదమైనది.

21. తెనుగుకవులచరిత్ర. ని. కెం. 1953 పు 83, 87, 91.

22. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సం 55 సం 5, 6.

23. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సం 52 సం 3, 4.

కాఁబట్టి నన్నయభట్టుకిపూర్వము తెలుగుకవులు లే రనుభ్రమతో చోడకవిని క్రిందకు నీడ్వనక్కఱ లేదు.

నన్నెచోడుఁడు (టెంకణాదిత్యుఁడు) యుద్ధములో మరణించినాడని యధర్వణకవి తెలిపియున్నాఁడు. క్రీ.శ. 880 ప్రాంతములో రేనాటి చోడులకును, వైదంబులకును చోరమడివద్ద జరిగిన ఘోరయుద్ధములో చోడకవి వీరస్వర్గము నలంకరించియుండును. అనేకమంది చోడులు మడియుటచేత నే యీస్థలమునకు చోరమడియను పేరు వచ్చియుండును.

నన్నయభట్టాదిమహాకవు లొక్కొక్క పుస్తకమునే వ్రాసియుండిరనుకొనుట పొరపాటు. వారువ్రాసిన యనేకపుస్తకములు నాశనమైనవి. మనవారు రసప్రధానగ్రంథముల నశ్రద్ధచేసి, భాషలో దొమ్మరిమొగ్గలు పిల్లిమొగ్గలు వేసెడివాటిని జాగ్రత్తపెట్టుకొనుట బహువిచారకరము. అట్టి సందర్భములో చోడునిగ్రంథము లభించుట యాంధ్రవాఙ్మయముయొక్క గొప్ప యదృష్టము మాత్రమె.

తనకు పూర్వమున్న వేమనకవివలెనే చోడకవికూడ శివాద్వైతి.

చోడకవి రచన ననేక తెలుగుకవులేకాక కన్నడకవులు కూడ ననుసరించిరి.

నన్నెచోడకవి సంస్కృతమహాకవులను ఒరవడిగా పెట్టుకొన్నవాఁడు. భాషాంగన దక్కనేలినవాఁడు (ఆ 1 ప 12), నవరసములలో (ఆ 1 ప 45), సద్రసబంధురంబుగా (ఆ 1 ప 48) ప్రబంధమును గూర్చినాడు. అతనితో సమానముగా తెలుగుకవిత్వమును జెప్పజాలినవారు నశ్రుతు. అతని గ్రంథము ఆపాదమస్తకమును రాజసలేక ఠీవి (గ్రాండ్ లేక మెజస్టిక్) శైలితో నలరారుచున్నది. మృదుమధురశబ్దముల మొత్తుకోళ్లలోఁబడి మనకవు లక్కడక్కడమాత్రమె రాజసశైలినిఁ జూపగలిగిరి. మృదుమధురశైలి మదగజముయొక్క స్వేచ్ఛావిహారమును, రాజసింహముల సంకులసమరమును వర్ణింపఁగలదా? చోడుని

కవిత్వమునుగుఱించి తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య చెప్పిన వాక్కులను గమనించండి— "భావచమత్కారప్రౌఢియందుఁ దిక్కనకే కాదు, తక్కిన కవులకెల్లను మిన్న యనవచ్చును. కల్పనాచాతురియందును శృంగారరసము పొంగిపొరలఁజేయు నైపుణియందును నతఁడసమానుఁడు."[24]

ఛందోవ్యాకరణాదిసంప్రదాయము లనుగొలుసులు మహాకవిగజమును గట్టిపెట్టుచున్నను, అప్పుడప్పుడదివాటిని తెంచుకొని, స్వైరముగా విహరించుచుండును. అది ప్రపంచములోని యంతటి మహాకవులకు నున్నగుణమె.

దుర్విమర్శనముచేసి మనము నన్నెచోడుని కాలమునుగాని, కవిత్వమునుగాని క్రిందకులాగెడి ప్రయత్నము బహువ్యర్థమైనది. అట్టి యుద్యమములో మనమె యుపహాస్యము పాలగుదుము.



24. ఆ. సా. ప. పత్రిక సం 7. సం 1 పుట 36.

# శ్రీ మట్టపల్లి లక్ష్మీనృసింహస్తోత్రము

సం॥ శ్రీ రంగాచార్య.

ప్లవంగ- మార్గశీర్ష- పుష్యముల సంచికయందు 'ఆర్వపల్లి లక్ష్మీనృసింహస్తోత్రము'ను ప్రచురించియుంటిమి. ప్రస్తుతము 'శ్రీ మట్టపల్లి లక్ష్మీనృసింహస్తోత్రము'ను ప్రచురించుచున్నవాఁడ.

ఈ స్తోత్రకర్త- గోవర్ధనం వెంకటనరసింహాచార్యులు (1856-1935) ఈయన మా 'నల్లగొండ' జిల్లాయందలి 'మిర్యాలగూడెము' తాలూకాకు జెందిన "విభురాముపేట"యను గ్రామవాస్తవ్యుఁడు- సుమారు 30 సం. క్రితము పరమపదించినాఁడు. ఈయన సంస్కృతాంధ్రపారసీభాషలయం దఖండపాండితీమండనుఁడు, కొన్నికృతులీకవివిమానాయనగారు సంగ్రహించి యుంచినారు, అందు ఒండు రెండు దప్ప యన్నియు నసూర్యంపశ్యలై-అలయసుం దముద్రితములై తరచాటున డాగియున్న బిబ్బీలవిధాన" మూలఁ బడియున్నవి. వాని కన్నింటికి సుదినము లెన్నఁ డబ్బునో ? నేటికిని-నాగుర్తులో తెలంగాణమునందు నెంతయో అమూల్యగ్రంథసంపత్తి, ప్రాచీనతాళపత్రములయందు మ్రగ్గి క్రిమికీటకాదులపాలగుచున్నది. అందే కొన్నింటినైనను 'భాషాసేవఁ జేయుచున్నాము' అను 'సాహిత్య ఎకాడెమీ' లవంటి సంస్థలు ఇఁకనైన ప్రచురింపఁ బ్రయత్నముచేసిన వారివాక్యము సత్యవంతమగునేమో ?

ఈ మట్టపల్లి లక్ష్మీనృసింహస్తోత్రము', 'పంచముఖీహనుమాన్ స్తోత్రము'- అను రెండుమాత్రము మావద్ద గలవు. (అనగా- ఆకవి లఘుకృతులీరెండుమాత్రము మాకు లభించినవి.)

'మట్టపల్లి' యనునది 'హుజూర్‌నగర' తా॥ చెందిన సుప్రసిద్ధ నృసింహక్షేత్రము, మహాప్రభావసంపన్నమైనసుక్షేత్రమీక్షేత్రము. నేటికిని యీస్వామిప్రభావాదు లచటజనుల నోళ్లతో వినిదీరవలయును. ఆస్వామిపై జెప్పిన దీస్తోత్రమాలిక.

పంచముఖీహనుమాన్ స్తోత్రము—దీనిని కవిగారు ఐదుపద్యము లుగా జెప్పి రనియు- అందు నొకపద్యము లభింపలే దనియు- మాతండ్రి గా రన్నారు.

ఈ గోవర్ధనం వెంకటనరసింహాచార్యులు శ్రీవైష్ణవుఁడు శ్రీవత్స గోత్రుఁడు. రామానుజాచార్య రామానుజాంబల యగ్రపుత్రుఁడు. ఈయన మానాయనగారికి మాతామహుఁడే కాక- సంస్కృతాంధ్ర భాషలను మానాయనగారికి నేర్పి సుకవిగా దిద్దితీర్చిన సుకృతుఁడు.

ఈ గోవర్ధనం వెంకటనరసింహాచార్యులను గూర్చియు, మావద్ద గల యీయన రచనలనుగూర్చియు త్వరలో సాహిత్యలోకమునకు విపులముగా విశదపఱచఁదలంచి ప్రస్తుతము స్వల్పముగఁ బరిచయ మొనర్చినవాఁడను,

కవి తనవాక్శక్తినిఁగూర్చి-

స్వర్ధవధోర్ధరోగ్రకులిశప్రహరంబు దొలంగిపన్ పయో
వార్ధితనూజ కేశవుని వక్షము బాసి మెలంగిపన్ తమ
స్వర్ధినభస్థలిం దలిగి వర్తిలినన్ విభురాముపేటగో
వర్ధననారసింహగురువర్యునివాక్యము దప్పిపోవునే.

అని చెప్పుకొనినాఁడు,

ఇతని చాటువులు- మొదలగునవి చాల కలవు. వానినిగూర్చి యు కవిని- కృతులను గూర్చియు త్వరలో తెలిసికొందము.

ప్రస్తుత మీ-స్తోత్రములు(లు).



# శ్రీ మట్టపల్లి లక్ష్మీనృసింహస్తోత్ర నవరత్నమాలికా

శ్రీ గోవర్ధనం వేంకటనరసింహాచార్యులు.

౧

శ్రీలక్ష్మీభూమినీళాముఖయువతిముఖాంభోజదీప్తార్కబింబమ్
సద్యశ్శుభద్యోతమాలానిభశుభమణిభృద్ధేమదీవ్యత్కిరీటమ్ ।
శుంభత్కుంభీంద్రకుంభస్థలసదృశమహాదీర్ఘబాహాంతరాళమ్
వందే హం దేవదేవం మదవనకరభీ ర్మట్టపల్లీనృసింహమ్॥

౨

రంగత్కోదండచక్రప్రథితదరగదాఖడ్గబిభ్రాణహస్తమ్
తుండీంద్రాఖండతుండప్రచురనిజభుజద్వంద్వమంభోజనేత్రమ్।
రారాజద్వజ్రదంష్ట్రం విపులపటుసటాకేశపాశాచ్ఛదాశమ్
లోకేశం నౌమి కృష్ణాసరిదచలగృహం మట్టపల్లీనృసింహమ్॥

3

కల్యాణస్ఫీతవస్త్రం కరనఖరశిఖైః ఖండితారాతివక్షమ్
నిర్వాణశ్రీప్రదంతం నిరుపమకరుణాలోలసన్మందహాసమ్ ।
కాలాగ్నిజ్వాలమాలానిభనయనరుచా దగ్ధదైతేయజాలమ్
ఫాలాక్షస్తుత్యపాదం నతసతతహితం మట్టపల్లీనృసింహమ్॥

౪

అక్షీణోద్యత్కటాక్షం పరుషరిపుచమూశిక్షదీక్షాప్రతీక్షమ్
అక్షుద్రాద్రీంద్రసాంద్రధృతిసహితమనఃపద్మమద్వైతరూపమ్।
భద్రేభాచ్ఛిద్రభద్రాంకకరవిలసచ్చక్రరాజప్రకాశమ్
దీవ్యంతం వజ్రదంతం హృదయనివసితం మట్టపల్లీనృసింహమ్॥

౫

శశ్వద్విశ్వప్రకాశం శతమఖహుతభుక్సర్వగీర్వాణసంస
ద్గంధర్వాక్షీణయక్షోత్సవమవ నిర్ ఋతిర్వాతపాశ్యాదిదిగ్రా
ట్పతాలీనాం నిస్త్రపాణా మసురగణరణక్ష్మారణ త్సింహనాదమ్
శీఘ్రదం నైజాంఘ్రియుగ్మప్రణతసుమనసం మట్టపల్లీనృసింహమ్॥

౬

వాణీవీణానినాదశ్రవణగుణయుతబ్రహ్మణా పూజితాంఘ్రిం(గం?)
నిష్ఠానాష్టాంగయోగాఖిలమునివినుతం సద్ధితం దైత్యడింభ
ప్రాణత్రాణప్రవీణ శ్మమితకల షకృత్సార్వగీర్వాణగర్వమ్
దృక్పర్వం గారుడార్వ్యం వసతు హృది సదా మట్లపల్లీనృసింహమ్॥

౭

శేషీభూతాఖిలాండం ద్రుహిణపరికృతం దోషశోషన్మనీషమ్
భూషం ముక్తాఫలాష్టాపదమణిఘటితం శేషపర్యంకసంస్థమ్ ।
ఘోషద్రక్షోవధూనాం నికరపరిచలద్గర్భనిర్భేదనాదమ్
ద్వేషం దోషాచరాణాం భయదదరదరిం మట్టపల్లీనృసింహమ్॥

౮

భవ్యం దివ్యాపగాంభః ప్రకరవినిచలత్తుంగభంగోపమాన
శృంగారశ్రీవిడంబత్రివళివలయుతాచ్ఛిన్నగంభీరనాభిమ్।
రంజన్మంజీరపుంజప్రతిఘటితలసత్పాదకంజం ముకుందమ్
వందే శ్రీమట్టపల్లిక్షితిభృదురుగుహాకేళివాసం నృసింహమ్॥

౯

హస్తన్యస్తాగ్రశంఖ ప్రబలతరరవాపూరితాబ్జాసనాండమ్
హిండచ్చండాంశుకోటి ప్రథితరుచిర సద్ధ్యానభోదిక్ప్రకాండమ్ ।
నానానిశ్వాసవాతప్రకర వినిహత ప్రావృడంభోదతండమ్
నౌమి శ్రీమట్టపల్లిపృథులగిరితటవ్యక్తలక్ష్మీనృసింహమ్॥



# పంచముఖి హనుమత్ స్తోత్రము

శ్రీమద్రాఘవరామనామమధురక్ష్వీకారహృత్పంకజా
సౌమిత్రీ ధరణీసుతాంఘ్రియుగళీ సంసేవ్యమేధానిధీ
సోమార్కప్రతిమానకాంతిరుచి సంశోభాయమానాంగద్వి
ద్భీమా వానరవక్త్ర వాయుసుతగంభీరాత్మ నిన్గొల్చెదన్॥ ౧

అక్షీణోగ్రపరాక్రమాతిశయ బాహాస్ఫాలనాభీలదృ
గ్రక్షశ్శిక్షణదక్షభక్తజన సంరక్షక్షమాదీక్ష స్వ
ర్ణక్షోణీధ్ర సమగ్రవిగ్రహ మహోగ్రగ్రాహదేహచ్ఛిదా
పీక్షాక్షాసల నారసింహముఖ సద్వీరా మరున్నందనా॥ ౨

అంభోజోద్భవశంభుజంభహరముఖ్యాదిత్య సంస్తవ్యకా
లాంభోదప్రతిమాన ఘోరరవ దీవ్యత్కంఠ కంఠీరవో
జ్జృంభచ్ఛౌర్య కపీంద్రవర్య సుగుణశ్రీమత్ఖగేంద్రాస్యసం
రంభోత్తంభ మరుత్కుమార ఘనశూరా నిన్ను ప్రార్థించెదన్॥ ౩

శ్రీడంఘ్రిద్వయ పూజనానవగత క్లిష్టాత్మ విశ్వంభరా
రాడగ్రేసర భాసురాగ్రణి పదార్జీవనిత్యాష్టది
క్రీడత్కీర్తి వశిష్ఠదీప్తియుత భూభృద్దీర్ఘదేహోల్లస
త్క్రోడాస్యామరుతాత్మజాతయొనరింతున్ పూజలవ్యాహృతిన్ ॥ ౪



బృహ:—ఆ పుష్పమాలిక ననాదరణముగ నందుకొని యమరేశ్వరు డైరావతికుంభస్థలముపైకి గిరాటువైచినాడు. ఆ మత్తగజము దానిని జీకాకుపఱచి తుదకు కాలఁద్రొక్కి పాడుసేసినది.

శంక:—అబ్బా! ఇంద్రుడెంతయనాలోచితకార్య మొనరించినాడు!

బృహ:—అది కనులార గాంచి మండిపడి యామునిసింహుడు దారుణముగ శపించినాడు.

శంక:—ఏమని?

బృహ:—

శా. ఏమైశ్వర్యము నీవు చూచుకొని యెంతే గర్వముం గాంచి నీ
వేయింగన్నులలోన కావరము లావేశింప మాబోంట్లకే
యాయాసం బవమానముం గలుగ జేయం బూనినావో? బళా!
ఆయైశ్వర్యము సర్వ మబ్ధిబడి నీయంధత్వమున్ బాపురా!

అని.

పార్వ:—అయ్యయ్యో! అపుడైనను దేవతాపతి యామునిపాదముల వ్రాలి శాపావసాన మనుగ్రహింపు డని వేడుకొనలేదా?

బృహ:—ఇటు శాపించి యమ్ముని యట నిముసమైన నిలువలేదుగదా.

పార్వ:—(సకరుణముగ) అటులైన నైరావతాదులతో బాటుగ నందనవనిలోని కల్పకాదులనుగూడ సాగరమున గలసిన వనుమాట?

శా. ఆలీలోకము చుట్టువారి సరసవ్యాహారముల్ సల్పగా
కేళిం దేలుచు పారిజాతములదక్కిన్ దా విలాసంబుగా
గాలక్షేపము సేయుచున్ విరిసరుల్ గల్పించుచున్ గ్రాలుమా
పౌలోమీసతి వైజయంతముననే వాసంబు గావించెనా?

బృహ:—ఔ నని చెప్పుటకు నోరు రాకున్నది. అమరుల యభాగ్యదశ యిారీతిగ నున్నది. చారులవలన నీ సంగతులు గ్రహించిన దానవులు తరచుగ దండెత్తి వచ్చి నాకలోకమున నానాహింసల నాచరించుచున్నారు.

శంక:—ఇందులకు ప్రతిక్రియ నేమి యోజించితిరి?

బృ:—సముద్రమథనము గావించి స్వర్గము గోలుపోయిన సర్వవస్తువుల సంపాదించుటే కాక యమృతమునుగూడ గ్రహింపవచ్చు నని యంబుజలోచనుడు హరిహయుని ప్రోత్సహించినాడు. వాసుకి త్రాడుగా, మందరనగము గవ్వముగా గొని దేవదానవు లీపని నిర్వహింప నేకగ్రీవముగా నామోదించిరి.

పార్వ:—అమరులపై నసురుల కింతయభిమాన మెప్పుడు గల్గినది?

బృహ:—స్వార్థమేకాని మరేమున్న దమ్మా! దేవదానవు లుభయులును కష్టించి గడించిన యమృతమును సమముగ బంచుకొన నిర్ణయించుకొనినారు. క్షీరసాగరమథనము రేపు ప్రారంభింపబడును. కావున మహేంద్రుని మనవిని మన్నించి మీపుణ్యదంపతులు దయచేయ ప్రార్థితులు.

శంక:—మునీంద్రా! కొంతకాలమునుండి నే ననారోగ్యస్థితిలోనుంటిని. రాజాలనందుల కన్యథా భావింపవలదని మీప్రభువునకు దెల్పుడు.

చ. కలగక సంచలింపక వికావికలై చనఁబోక, దీక్షతో
జలధి మథించుచో నమృతసత్ఫలలాభము గల్గు; కష్టముల్
తొలగును నాకసీమ కని తోయజనాభునితో సురేంద్రుతో
బలుకుము నాదుమాటలుగ భద్రముగా జనుమయ్య! గీష్పతీ!

బృహ:—అటులైన దేవరకుబ్రతిగ కుమారవినాయకులనైన బంపరాదా? ఆ విఘ్ననాయకుని తొలుత పూజించి దేవదానవులు కార్యక్రమమునకు గడంగుదురు.

పార్వ:—(నవ్వుచు) అందఱుపెద్ద లుండగ...నర్భకుని...

శంక:—దేవీ! అమరేశ్వరునికోరికను మనము నిరాకరింపదగునా? శీఘ్రముగ చిరంజీవిని ప్రయాణసన్నద్ధుని గావింపుము.

బృహ:—మహాప్రసాదము.

(తెర వ్రాలును.)



# ద్వితీయాంకము-చతుర్థ రంగము

(ప్రదేశము — కైలాసము)

[ప్రవేశము:—భృంగి-తమాల]

భృంగి:—తమాలా! అయ్యవారిని జేయబోవగ కోతియైనటు లమృత కుంభమునకై యంబుధి మథింప హాలాహలము పుట్టి సురాసురుల బరిమార్చుచున్నదా? చక్రిచక్రమే మైనది? వజ్రివజ్రమే మైనది? కాలదండ మే మైనది? వారుణపాశ మే మైనది? వీనిలో నొక్కటియు దాని నివారింపలేకపోయినవా?

తమా:—అన్నిప్రియత్నములును నడుగంటుటచేత నే కదా యీ రాష్ట్ర నాయకుల కాహ్వానము వచ్చినది. హాలాహలము నదలించుచు ముందునకు మూడడుగు లిడిసరికి దాని దాణజ్వాలల వేడిమి కంత తెల్లని విష్ణుదేవుడును నల్లే కారుమబ్బువలె మాడిపోయినాడట!

భృంగి:—అవుడు హరి తమాలాకృతి ధరించె నన్నమాట.

తమా;—నీకొంటెమాటల కేమిగాని మనభవానమ్మ బ్రతిమాలుకొను చున్నను మానక యాశ్రితవత్సలు డగుటచే హాలాహలభక్షణమున కయ్యగా రాయత్తమై యేగినారు.

భృంగి:—బాగుగ నున్నది. పాడి యొకరిదా? పేడ యొకరిదా? కన్యాదాన మొకరిది, గర్భాధాన మింకొకరిది. సిరియొక్కరిది. చిడుము మరియొక్కరిది. అమృత మమరులది- హాలాహల మార్యామనోహరునిది. ఔనుగాని తమాలా! నితాంతసన్నిధానవర్తినగు నన్ను వెంటనిడుకొనక యే వేంచేసినా రేమిచెపుమా? శంకర దేవులు.

తమా:- -(నవ్వుచు) పెండ్లి కేగునపుడు పిల్లికూనను జంకనిడుకొని పోవలెను గాబోలును! (హేళనగా) ఔనుసుమీ భృంగీ! మహాబల శాలివి, ధీరుడవు. నీసాయ మాయీశ్వరు లర్థింపవలసినదే.

భృంగి:—ఆర్యాపతి హాలాహలస్వీకారమున కరుగుచుండి కనుకొంటిని గాని పెండ్లి కొఱకని యెఱుగకపోతిని. అచ్చటివిశేషముల దెలిసి కొన నార్యాదేవి నన్ను నియోగింపలే దేమో! నాకును పోవల యు నని యున్నది.

తమా:—ప్రభువువారి వెనుక పరిమళు నొకని బంపి యచటివార్తల నమ్మ యపుడే సేకరించినది.

భృంగి:—ఆపనికి సదానుచరుడ నగున న్నేల దేవి నియోగింప లేదో ?

తమా:—వికటభాషలచే విసివించుటయేకాని విషయము విస్తరించి విన్నవింప వను ననుమానముచే గాబోలును.

భృంగి:—వచ్చినవార్తలలోని విశేషము లేమి ?

తమా:—ఏ మున్నవి. హాలాహలము నభవదేవు డాస్వాదించినాడు. మేఘములు తొలగినతోడనే మిహిరదర్శనమే కాదా ? గోత్రభేది కోలుపోయినవైభవ మంతయు పునరుద్భవ మైనది. చంద్రికు లక్ష్మి సహితముగ పాలకడలినుండి వెలువడినా డట.

భృంగి:—ఎంతసేపును నష్టద్రవ్యలాభము నే చెప్పెదవుగాని సుధాకుంభ విషయమై సుంతైన మాట యూడిపడ దేమి ?

తమా:—దాని తలచుకొనిన నో హూరు మన్నదా? కట్టకడపటివృత్తాం తమును ముందుగ నే చెప్పమందు వేమి ?

భృంగి:—ఇంకను మధ్యగ సపాదలక్షగ్రంథము జరిగిన దని నా కెట్లు తెలియును ?

తమా:—రమాదేవిని రాజీవలోచనుడు పరిగ్రహింపబోవగ మన కుమారవినాయకదేవు డామెను బలవంతముగ దనతోడపై నిడు కొని యెందఱుచెప్పినను విడువ నిరాకరించినాడట.

భృంగి:—ఔను. అందు తప్పేమి? బ్రహ్మచర్యదీక్ష నింతదనుక భద్ర ముగా పాలించుచున్న మనయాయుష్మంతు డయత్నసిద్ధ మగునా

మెను విడువగలవా? అపు డేమైన దే! తమాలా! దేవతా స్తవము లచే చిత్తము మెత్తబడి చేజిక్కిన ఫలమును జారవిడువ లేదుగదా!

తమా:—"కమలా దేవి కమలాక్షునికొఱ కవతరించినది. కావున నీవు పరిగ్రహింపరా"దని యయ్యగారు బ్రతిమాలినను వీడుటకు నిరాక రించినాడట.

భృంగి:—పట్టుదలలో పార్వతిపట్టి యనిపించుకొనినాఁడే మన గణపతి దేవుడు.పుత్రుని బుజ్జగించి పౌలతిని విడిపించుటకేనా యేమి భారతీ దేవి స్వయముగ దయచేసి నేటియుదయముననే భవానమ్మను వెంట బెట్టుకొని వెడలినది.

తమా:—ఔను. పర్యవసాన మేమైనదో యింతవఱకు తెలియ లేదు. నే నీమధ్యాహ్న మమ్మగారి చెంత కరుగుచున్నాను. నన్ను వెనుక నుండిర మ్మని దేవి యాజ్ఞ యైనది.

భృంగి:—కైలాసమున కొటుకలోనికైన కాంత లేకుండ కట్టగట్టుకొని యందఱును పోయెదరా ?

తమా:—నీ వుంటివి గాదా. (నవ్వును).

భృంగి:—నా యాడంగితనము తమాల కనుభవ మైనటు లున్నదే !

తమా:—అదిగో- అదిగో- అట్టి యవకతవకమాట లే వల దని యెన్ని సారులు మందలింపవలెను. ఒకమా రమ్మగారితో చెప్పవలయునా యేమి? (అని భృంగి చెంపపై గొట్టి పరుగిడును).

భృంగి:—అబ్బా! ఎంత చఱపు చఱచితివే రాకాసీ! మతకరిబానిసా ! పద పద, నీపని పట్టక మానను.

(నిష్క్రమింతురు.)



## తృతీయాంకము-ప్రథమ రంగము

(ప్రదేశము:—మందాకినీ తీరము.)

ప్రవేశము:—గంగ (దీనవదన యై)

గంగ:—

ఉ. పంచశరున్ మదిన్ విపుల భావనసేసి నమస్కరించి మే
లెంచి సువర్ణకంజముల నెంతయు మాలికఁగుచ్చి భృంగిచే
నంచితి నామహేశ్వరున; కాతఁడు దాని ప్రియంబుమీఱ మ
న్నించి గ్రహించెనో? పరిగణింపక చాల తిరస్కరించెనో ?

ఏమో నాభాగ్య మెటు లున్నదో? గ్రహించె నని యె నిశ్చయించినను నంతమాత్రమున నేమిప్రయోజన మున్నది? ఆమాలిక భక్తిపూర్వక ముగ బంపబడినటు లెంచునో- ప్రణయపూర్వక మని భావించునో! భక్తియు ప్రేమమును స్వరూపమున నొక్కటేయైనను ఫలమును ప్రసాదించుటలోమాత్రము విభేదము గలదుగదా. నాటిసభాభవనమున నాప్రణయాతిథ్యము నొక్కకను మోడ్పుతో స్వీకరింప లేదా? అయ్యో! అది నాచిత్తభ్రాంతియేమో ! ఆఁ. అంతటి మహానుభావుడు- అంతటి రసికశిఖామణి నాయంతరంగము నెఱుంగజాలడా ? సంసారసౌఖ్యము జవిచూచని సదా బ్రహ్మచారి కాడే. (చూచి) ఎవ్వరీప్రాంతమున చరించువారు? వీరశైవాగ్రణి భృంగివలె నున్నాడు. ఔను. అతడే. (ప్రకాశముగ) భృంగీ! భృంగీ! ఇక్కడ నున్నాను- రా రమ్ము.

భృంగి:—(ప్రవేశించి) ఇక్కడనే యున్నాడా ? మా కైలాసవాసుడు. క్షీరసాగరము వీడి యపుడే యిచటకు వేంచేసినాడా?మా యుమాధవుఁడు ?

గంగ:—శంకరస్వామి సముద్రమథనము సందర్శింప నేగినారా ?

భృంగి:—కాక కైలాసమునుండియే తమరాక యని నీతో బలికెనా ?

గంగ:—నాతో నన్ృతములు పలుకుటకును, నపహాస్యము లాడుటకును శంకరదేవు లిచట సాక్షాత్కరించినగదా-

భృంగి:—వింతగ మాటాడెద వేమి దేవీ! ఇపుడేకదా యిచటనే యున్నాడని పిలిచి నా కాస గొల్పితివి.

గంగ:—లేమి. లేదు. నాకొఱకే నీ వన్వేషించు చుంటివేమో యని తలంచి "ఇచ్చటనే యుంటిని, ర మ్మంటిని.

భృంగి:—అటులైన నథవు డింకను నిటకు వేంచేయ నేలే దనుమాట.

గంగ:—(ఆనందముతో) ఏమోయి! భృంగీ! క్షీరసాగరసీమనుండి మరలివచ్చునపు డీ దీనురాలికి దివ్యదర్శనము గటాక్షించెద మని నీతో ననినారా? మాటాడవేమి? నాయనా?

భృంగి:—అట్టిపలుకు లాతనిపెదవులనుండి జాఱుట నే నాలకింపలేదు.

గంగ:—అన్యులనుండి నీ వీవిషయమును తెలిసికొంటివి గాబోలును.

భృంగి:—ఆబోతు నంటి విడువని జోరీగవలె నయ్యగారి నెన్నడునువిడ నాడని నాకంటె యాతనియంతరంగము పరుల కెక్కుడు తెలియునా? వెఱ్ఱితల్లీ! కనకనీ రేజమాలికను మనసార గైకొనినమహానుభావుడు తన మహానందమును తన కృతజ్ఞతను మాటలతోనైన దేటపరుప నిటకు రాకుండునా యని యూహించి యిటు లంటిని.

గంగ:—గ్రహించెనా? నేను సమర్పించినమాలికను పరిగ్రహించెనా? మనసార పరిగ్రహించె నని యంటివే. ఈవాక్యమునుగూడ నీ వూహించి పలుక లేదు గదా.

భృంగి:—చిఱునవ్వుతో స్వీకరించినపుడుగూడ చిత్తవృత్తి నెఱుగలే నంతటి మూఢుడనా దేవీ!

గంగ:—అటులైన నావంటిధన్యురా లేలోకమునను లే దని గర్వించెదను. నాయనా! భృంగీ! మాలికను భుజంగభూషణుని మెడలో నీవు వైచితివా? లేక తానే యందుకొని ధరించెనా?

భృంగి:—రెండును జరుగలేదు.

గంగ:—(తెల్లవోయి) ఇదియేమి! ఇపుడేగదా శంభుదేవుడు స్వీకరించె నంటివి.

భృంగి:—స్వీకరించుట యనుపదమునకు మెడలో వైచుకొనుట యను నర్థము నే నెన్నడును వినియుండ లేదు.

గంగ:—ఏమోయి! తండ్రీ! నాకుమారుగ నామాలికచే నాగకంకణుని కంఠసీమ నలంకరింపు మని నిన్ను బ్రతిమాలుకొనలేదా?

భృంగి:—చెప్పితి వమ్మా! చెప్పితివి. లే దనుచుంటినా? కాని యేమి ప్రయోజనము? ప్రతికమలదళముపైనను "చరణదాసి-గంగ" "చరణదాసి-గంగ" యని నా తలకాయంత యక్కరములు చిత్రించితివి. దానిని ధరించిన పశుపతిని పార్వతీదేవి పరిశీలించుట తటస్థించిన నిం కేమైన నున్నదా!

గంగ:—ఓహో! అంగీకార మధికముగ నున్నను నీకారణముచే ధరింప వీలులేకపోయిన దనుమాట యే కాదా.

భృంగి:—నీనామమే యందు లిఖింపబడకున్న నిరాఘాటముగ శివుడద్దానిని ధరించి నిర్భయముగ నెల్లెడ దిరిగియే యుండును. కాత్యాయనీదేవి కన్గొనియు నేభక్తులో సమర్పించి యుందు రని తలపోసి యుండెడిది.

గంగ:—పోనిమ్ము. భృంగీ! మానసికముగ మహాత్ముడు స్వీకరించెను. నా కదియే చాలును.

భృంగి:—అమ్మా! ఇక నేను పోవచ్చునా?

గంగ:—అంత తొందరపడెద వేమి భృంగీ! ఈయొక్క మాటకును మంచిసమాధాన మిచ్చి పొమ్ము.చూడు. నీవు మహాదేవుని యాంతరంగికపరిజనుడవుగదా, నన్నుగూర్చి యెన్నడైన నా దేవదేవుని వదనమునుండి యెట్టిప్రసంగమైన వచ్చినదా?

భృంగి:—ఏమి మంత్రించి మాలిక నొసంగితివో కాని దానిని తాకిన నాటినుండి నేటివరకును శంకరస్వామికి నిద్రాహారములు కరవై పోయినవి. కన్ను మూతపడినపు డెల్ల నీ నామజపమే. దాని నాల

కించిన దాక్షాయినికిని ధవునకును కావలసినంతవాక్కలహ మారంభమైనది. నీకు నమస్కారములు. నన్నిక బోనిమ్ము.

(నిష్క్రమించును.)

గంగ:—(తనలో) ఆహా! నామానస మిపుడు చల్లవడినది. హృదయములోని యాందోళన మిప్పటికి శమించినది. కామదేవుడు నాపై కరుణామృతమును జోరుగ గుమ్మరించినాడు. కుసుమశరాసనా! నీ కోదండపాండిత్యములో నెంతవింత యున్నదయ్యా!

తే. గీ. ఏకవస్తువు రెంటిగా నేయువారు
పలువు రున్నారు విలుకాండ్రు ప్రాయికముగ
కాని రెం డొండుగా నేయుగలుగునేర్పు
దనరి యుండుటచే మహాధన్వి వీవు.

(నిష్క్రమించును.)



## తృతీయాంకము—ద్వితీయ రంగము

(ప్రదేశము:—క్షీరసాగర పరిసరభూమి)

ప్రవేశము:—కరాళుడు-దమనకుడు నను రాక్షసభటులు.

కరా:—ఆగరా:—దమనకా! ఆగరా! కాలుగాలిన పిల్లివలె, చెవి పుచ్చినకుక్కవలె కారుమారులాడుచు కలయదిరిగెద వెందులకురా? ఆ టక్కులాడి జగన్మోహిని నీకు జిక్కునదియే దురాశతో తూగులాడుచున్నా వటరా? అరువదికోట్ల యసురవీరుల నట్టట్టే మురిపించి మురిపించి యమృతభాండ మంకించుకొని యమరులచే పొట్టలు పొణకలవలె యుబుకువరకు త్రావించినజాణను మనవంటి నిర్భాగ్యుల మటరా! వెదకి పట్టుకొనుట ?

దమన:—కరాళా! ఔనురా! ఆపిరికిముండకొడుకు లమరులు వాసుకి తోకను బట్టుకొనియే వ్రేలాడిరిగాని పడగవైపు పౌశణైన పట్టినాడా!

వారికంటె మనమే చెమ్మటలూర్చి సంపాదించితిమి. సుధాకుంభము చూచుచుండగనే సురలపా లైనది. అమృతముపై నాసచేతనే కాదటరా! మనవారలు శ్రీదేవిని హరికి, చింతామణిని, కామధేనువును, కల్పవృక్షమును,నైరావతమును నింకేమేమియో యన్నిటిని నమరేంద్రున కొసగినారు. పాపము! అంబికాపతికి హాలాహలము మాత్రమే వంతుగ వచ్చినది.

కరా:—తలపూవుగ ధరించుకొనుటకై చంద్రకళ నొసంగిరి కాదా?

దమ:—శశాంకు నొసగుట సిగపూవుగ సింగారించుకొనుట కనుకొంటివా? కాదు. హాలాహలము కబళించుటచే తలకెక్కిన వేడిమి తగ్గుటకై యౌషధప్రాయముగ నొసఁగినారు.

కరా:—హరిపోగ రణగుసటుల గజానన దేవుడు లక్ష్మి నంకించుకొని విడువ నని గట్టిపట్టు బట్టినాడురా!

దమన:—అంతపట్టును నంబికాదేవి వచ్చి నిలుచుసరి కట్టలే మంచువలె విడిపోయినది కాదా? జననిమాట జవదాటజాలక-యంతరంగమున నాగ్రహము నణచుకొనలేక తుద కాజన్మాంతమును బ్రహ్మచారిగనే యుందు నని ప్రతిన వట్టినాడు గదా.

కరా:—పట్టక యేమిచేయగలడు? పొట్టగలవానికి పట్టియుబలాటమే కాని...

దమ:—దీని కేమి గాని-యావిషయమే యన్యాయముగ నైపోయినదిరా. ఇందఱి నేడ్పించుటకు నిందఱినోట బెడ్డ గొట్టుటకా మోహిని యెక్కడినుండి దాపురించినదో? దేవదానవుల వేరు వేరుగ బంతులుదీర్చి కూర్చుండబెట్టినది. వడ్డన యమరులపంక్తినుండి యారంభ మైనది. అసురపంక్తికి వచ్చుసరి కంత మైనది.

కరా:—అమృతముతో బాటుగ నసుర్రపులకూడ జారవిడుచుట యెందులకు? మన జీలుగుకళ్లే మనకు మిగిలినది. దమనకా! ఆమోహినిని నీవు తిన్నగ జూచితివటరా?

దమన:—ఓ చూడ కేమి? నన్ను గని కనుసైగకూడ జేసినది.

కరా:—ఓరి దొంగముండకొడుకా! నీ మొగమునకు, నా మొగమున కును నాపాటియదృష్ట మటరా! అపుడు నీ వేమి చేసితివి?

దమన:—ఏమో- ఆమెను జూచి మనపెద్ద లందఱును గుటకలుమ్రింగి నారు గాని నా కేమియు నచ్చలేదు రా!

కరా:—ఆమెరూపులో నీ కేమిరుచించలేదు?

దమన:—ముందుగ మేనిచాయయే బాగుగ లేదు. అంత తెలు పేమి టిరా! నీ వేమన్నను సరియే కాని నల్లని మేని కున్నబింకము- తెల్లని నరకులో నుండదు రా! పై బండార మే కాని.

కరా:—(నవ్వుచు) సరి. సరి. చాయసంగతి నైనది. ఇక యవయవ ముల విషయము.

దమన:—వానిలో మాత్రము మెచ్చన కొక్కటి యైన యొడుపుగ నేడ్చె నదా? పట్టెడుకబళము బడ వేయుటకైన సందు లేకుండ నంతచిన్ననో రేమిటిరా? వెన్నెముకపై మాంసము పీకుకొని తినుట కా చిన్నపలు వరుస పనికివచ్చునా? గోగుపుల్లవలె సన్నముగ నున్న యా నడుము చిన్నబరువు మోపుసరికి చిటుక్కున విఱిగి ముక్కలై పోదా? ఇది యది యని యెంచు టెందులకు? అన్నియు నత్యాన్నముగానే తగులబడినవి.

కరా:—అటులైన చూచి తల లెగురవైచినమనవా రందఱకును మతులు పోయిన వందువా?

దమన:— మతులే యున్నచో మనజాతి కీగతి యేమి? అదియును గాక పుఱ్ఱె కొకబుద్ధియు- జిహ్వ కొకరుచియును-

కరా:—బావా! దమనకా! ఆమోహిని యయాచితముగ నీ కడకు వచ్చి నిన్ను వరించిన దనుకొనుము. అపుడు నీ వేమిచేయుదువు?

దమన:—అందమైనయాడుది యంతమాట వినరినవు డంగీకరింపక తప్పునా? ఏదో కాసంత కా దనిపించి...

కరా:—ఓరిపిడుగా! ఇపుడే కాదటరా! యేడిచినటు లేయున్న దిదానియంద మని ప్రేలితివి.

దమన:—ఇపుడుమాత్ర మామె చక్కనిచక్క యని చంకలు వైచుకొనుచున్నానా? ఏదో- సంసారము సాగించుట కంతసౌందర్య మెందులకు?

కరా:—పోనిమ్ము. నీ కంతయునిష్టముగ నున్న దానిని నా కొసగరాదా?

దమన:—ఛీ. ఛీ. నీమతి మండ! నన్ను మోహించివచ్చినది నీ కక్కగా రగుటచే వావి యగునటరా!

కరా:—అబ్బ! అబ్బ! ఏమి దరిద్రమనోరథములు? నీ యేడుపుమొగము చూచి యప్పుడే యామె వరించి నీపై బడినది. నీవు వావివరుసలు వెదకుచున్నావు.

దమన:—పోరా. నీ చచ్చుమాటల కేమి? లే. లే. ప్రభుశాసనము పరాకుపడినావా? లాభము లేకపోయినను వెదకుట తప్పదుకదా. గుఱ్ఱము గుడ్డిదైనను ఖాణము తప్పునా? విధవయైనను వేవిళ్ల బాధ ననుభవింపక తీరునా? పద. పద.

కరా:—మోహినిని బట్టి యప్పగించినవారికి గొప్పబహుమాన మొసంగుదు మని మనచక్రవర్తి పలికెనట. సత్యమేనా?

దమ:—ఆ యాసచేతనే కాదా యిటు లాయాసపడుచు నీ తిప్పలలో ద్రిప్పటులు పడుచున్నాడను.

కరా:—పెంకిముండకొడుకా! నీచెవి నీమాట యపుడే పడినదా? రాజాజ్ఞ- రాజశాసన మని యఱచితివే. పద. పద. వెఱ్ఱియాసలు విడిచి యింటిమొగము పట్టుము.

దమన:—(చూపి) ఆగు. ఆగు. ఇటు పరిశీలించుము. ఈ యడుగుల జాడ లామోహినివి గావా? ఇవెగో శుభ రేఖలు. ఎంతస్పష్టముగా నంటెనవో.

కరా:—నీ సాముద్రిక శాస్త్రము చట్టుబండలుగాను. సరే. నడు. మన కాళ్లయం దింకను శని యున్నాడు.

(ఇరువురు పరిక్రమింతురు.)

---

## తృతీయాంకము—తృతీయరంగము

(ప్రదేశము:—మందాకినీపరిసరవనాంతరము.)

ప్రవేశము:—జగన్మోహిని.

(తుమ్మెద నుద్దేశించి)

చ. కులుకుచు వ్రాలెదీవు లతికూనలపై వలుమాఱు రాగముం
జిలుకుచు చుట్టుచుట్టును విశేషగతిం దిరుగాడి; చాలు నీ
నిలుకడలేనివర్తనము నేను గ్రహింపంగలే దటంచు లో
దలచితి వేమొ! రాకుము వృధాశ్రమ నందకు మోయళీశ్వరా!

శంకరుడు:—(ప్రవేశించి) మోహినీ! నాజగన్మోహినీ! నన్ను వంచించి నాహృదయ మపహరించి, నానాబాధల బెట్టుచున్నావా! మెఱపు వలె తళుక్కున మెరసి యంతలో నదృశ్యమై యిచట మరల నాభాగ్యవశమున సాక్షాత్కరించితివా? ఇప్పుడైన నన్ననుగ్రహింపవా?

మోహి:—(శివుని చూడనట్లు నటించి)

మ. వినువావంతయు లేదె? త్రిమ్మరుటకున్ వేమారు లామోదపుం
బస జూడన్ భ్రమజెందితే? రసము నాస్వాదింప నేతెంచితే
వసవుం బొట్టును వెట్టి నిన్నెనతె యాహ్వానించె రా?యిమ్మెడన్
వసియింపన్ భ్రమరేశ! నీదుసతి కోపం బూని దండింపదే!

శంక:—ఆహాహా! ఏమి యీమె సరసవాచావిలాసములు! భ్రమర వ్యాజమున నెంతమధురముగ నన్ను వారించి ప్రేమమును ప్రేరేచుచున్నది! (ప్రకాశముగ) ఓ సౌందర్యరాశీ! నిను కనులార గాంచుటకు, నోరార పిలుచుటకు, నీమనోహరరూపము మనసార ధ్యానించుటకు, నీచిలుకపలుకుల చెవులార వినుటకును నాకు ప్రత్యేకాహ్వాన మెందులకు? ఎంతసేపు చూచినను నీమోహనరూపములో విసువుపుట్టించుగుణము లేదే. నాప్రాణపదమా! శృంగారరసమయీ! మోమటు త్రిప్పుకొననేల?

చ. ఒకచిఱునవ్వుతో మివుల నూగట నంది ప్రశాంతి గాంతునే!
ఒకతలయూపుతో నెడద నువ్విళులూరుచు పొంగిపోదునే
ఒకయనుకూలమైనపలు కుట్టిపడన్ మినుముట్టి యుందునే
వికచపయోజనేత్రి! యిటు వేగుచు నున్నను జాలి లేదటే!

మోహి:—(చూచి) ఓహో! కాత్యాయనీప్రాణేశ్వరులా! విజితమన్మథులా? వలదని వారించినను వదలక వెంటనంటుచు మహాశ్రమ గైకొనుచున్నారే!

శంక:—నాశ్రమ కేమి? ఒక్కబిగికౌగిలితో నొక్కలేనవ్వుతో నొక్క కమ్మమోవియారగింపుతో నన్నిబడలికలను శమింపజేయుశక్తిగల నాభువనమోహిని నాచెంతనుండ నా కేమికావలయును?

మోహి:—వైరాగ్యమూర్తుల వదనమునుండి జాఱవలసినపలుకులేనా యివి?

శంక:—నీమోహనాకృతిని సందర్శించినపిమ్మట నియమములకు నిలువ నీడ యుండునా? కుసుమకోమలీ!

మోహి:—(నగుచు) ఈప్రేమప్రదర్శనము లెంతవఱకు? ఈప్రార్థన లెంతవఱకు? ఈ దీనదీనత్వ మెంతవఱకు? నీవు మహానటుడ వని నే నెఱుగనా? గౌరీరమణా!

మ. వగఁజూపించెద, రీవె దిక్కనుచు సంప్రార్థింత్రు నిన్బాసి యుం
డఁగలే నందురు, కేలు వట్టుకొని దైన్యంబార వీక్షించి ని
ల్వఁగలే నందురు, కోర్కె తీఱునెడ నీ వంకైన నీక్షింప రీ
మగజాతిన్ మది నమ్మఁగానగునె? పొమ్మా మాట లింకేటికిన్.

శంక:—మోహినీ! మోహినీ! లోకములోని నీచకాముకులతో నన్ను సరిజేయుదువా?

మోహి:—ఆఁ. అటులనేమి! పరకామినీపరాఙ్ముఖా! అటులనేమి? హైమవతి యైనదా! దారుకావనిలోని తాపసతరుణీమణు లైనారా? గగనగంగ కాఁబోవుచున్నదా? ఇంతిలో నేను కంటబడి కావలసిన దాన నైతినా? కావున కాముకుల నీమములకును, కోరికలకును, కుదురుపాటెందున్నది?

శంక:—మధురవాణీ! చల్లని నీవలుకులు నాకు శ్రవణానందమును సంపాదించుచున్నవే కాని భావములు మానసమును బాధించుటయే లేదు సుమా! అనుము. నీ వెన్ని యనఁదలచితివో యన్నియు ననుము. అవి యన్నియు నన్ననుగ్రహించుటకే యని నే నెఱుంగనా?

మోహి:—ఈపాటి మొండితనము కాముకుల కుండనిచో కార్యసిద్ధి కవకాశము గలుగనేరదుగదా!

శంక:—నా భాగ్యదేవతా! నాప్రణయసామ్రాజ్యపట్టమహిషీ! నాపై నింకను దయ కలుగలేదా? నాకు తల తిరిగిపోవుచున్నది. కనుల జీకటులు గ్రమ్ముచున్నవి. కాపాడవా!

మోహి:—కంఠమున విసము బెట్టుకొని కమ్మనిమాట లాడువాని నమ్మవలసినపని యున్నదా?

శంక:—అయ్యో! నను విశ్వసింపవా? త్రికరణశుద్ధిగ నిన్నే ప్రేమించిన నన్నేలుకొనవా? జగన్మోహినీ!

మోహి:—జగన్మోహిని యెవ్వతె?

శంక:—ఏ మటు లనెదవు. నీపేరు జగన్మోహినికాదా? "పట్టుకొనుడు జగన్మోహినిని పట్టుకొను" డని దానవభటు లఱచుచు వెన్నను సరించుట నేను వినియుండలే దనుకొంటివా?

మోహి:—(నవ్వి) అది నాసౌందర్యప్రశంస యని యేల తలపరాదు? నా యథార్థనామ మది కాదు.

శంక:—అటులైన నీపేరిమార్చుకు డేనామమున నిను జపింపవలయును?

మోహి:—నేను మందాకినిని. . .

శంక:—కాదు. కాదు. నీవు గగనగంగవు కావు. నే నెఱుగనా! నే నామెను చూచియుండలేదా?

మోహి:—పోనిమ్ము. శంకరదేవా! ఇటు చూడుము. బాగుగ చూచి చెప్పుము. నేను సుందరినా లేక మీా గంగ సుందరియా?

శంక:—మీా కిరువురకును హా స్తిమశకాంతరము భేద మున్నది?నీకాలి గోటికైన నామె సాటియగునా?

మోహి:—పోనిమ్ము. గంగాపార్వతులలో నెవ్వరు సౌందర్యవతులో చెప్పగలవా?

శంక:—ఈవృథాప్రశ్నలచే నన్ను విసిపింప నేల? న న్ననుగ్రహింపుము.

మోహి:—(నవ్వుచు) నీమాటలలో- నీపేరిమలో- నీప్రవర్తనలో నా కింకను ననుమానింపదగినది యున్నది. నా కింకను నీపై పూర్ణ విశ్వాసము లేదు.

శంక:—లేదా? లేదా? సత్యముగ లేదా! (మీాదికి బోవును.)

మోహి:—లేదు. మోసగాడా! లే దని యనుచుండ వినబడుట లేదా?

(అని మాలికతో శివుని ప్రహరించి పరుగిడును.)

శంక—:(వెంటనంటును.)



ప్రదేశము:—గంగాతీరము.

ప్రవేశము:—తమాల.

తమా:—(శ్రమ నటించి) ఇప్పటికింతవరకు ప్రయాణించితిని. క్షీరాబ్ధి యింకను చాలదూరమున నున్నది. ఒక్కనిముస మీ యిసుక తిన్నెపై నీతరుచ్ఛాయ విశ్రమించి మఱియు ప్రయాణము సాగించెద. (నేపథ్యమున) ప్రాణేశా ! నా జీవిత కావ్యమున నిదియే యంతిమాశ్వాసమా ?

తమా:—(ఉలికిపడి చూచి) ఆఁ ఆఁ మాయమ్మయే! మాభవానమ్మయే! ఏమిచెపుమా! ఇటు లాక్రోశించుచు వచ్చుచున్నది.

(పార్వతి ప్రవేశించుచున్నది.)

పార్వ:—(చూచి) తమాలా! తమాలా! నీవేనటే! కాకొఱకే వచ్చుచున్నావా ?

తమా:—ఔనమ్మా! నీకొఱకే.

పార్వ:—నను దోడుకొనివచ్చుటకు మనభృంగిని బంపక నిన్ను బంపిరేమే?

తమా:—నన్నెవరును బంపలేదు. నాకు నేనే వచ్చుచున్నానమ్మా!

పార్వ:—అటులైన నయ్యగారటకు రాలేదా ?

తమా:—లేదు. నీవు వారి నా సముద్రముచెంత గలిసికొనలేదా ?

పార్వ:—(నిట్టూర్పుతో) అయ్యో! ఇంకేమున్నదే. మన దాయుమ్మంతుని ననునయించి యభవదేవునిఁగూర్చి యడిగితిని.

తే. గీ. శీతకిరణుని శిరముపై జేర్చుకొనియు
హాలహాలతీవ్రగతి మాన్ప నలవిగాక
అస్తిమితుఁడౌచు పతి యెటో యరిగె ననుచు
నే నచట నాలకించితినే తమాల !

తమాల:—అమ్మయ్యో! అట్టిస్థితిలో నమరులందఱటనుండియు నాయన నుపచరింపక విడిచిపుచ్చినారా ?

పార్వ:—అమృత భాండమునకై యసురులతో బెనుగులాడుచున్న వారి
కా దృష్టియే లేకుండ పోయినది. ఏమే ప్రాణసఖీ! నా మనోనాథున
కెట్టిప్రమాదమును రాదుగదా.

తమా:—అనలలోచనునకు, నఖిలలోకేశ్వరునకు, హాలాహల మొక
లెక్కటమ్మా! ఏదియో రసవంతపైత్యవికారముచే తలతిరిగి, కనుల
చీకటులు గ్రమ్మియుంటచే విశ్రాంతి గైకొననెంచి యేమందాకినీ
తీరమునకో వేంచేసి యుండును. అంతమహాత్మునకే యెడల నవ
సరము లేదు.

పార్వ:—మందాకినీ తీరమునకా? ఔను సుమా— తమాలా! ఔను
సుమా! చల్లగాలిని సేవించుమిష బూని యచటికే తప్పక చని
యుందురు, ఉభయతారకముగ నుండునని యిచటికే చేరుకొని
యుందురు. మంచియూహ నీమదికి దోచినదే. పద పద. వడిగ
నడువుము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

(తెర నెత్తగా గంగ ప్రవేశించును.)

గంగ:—(చూచి యాశ్చర్యముతో) ఏమిది చెప్పుమా! బెదరిన ముంగు
రులతో, చెమ్మటలు గార, నీనడిపొద్దు ఎండలో శర్వాణి సఖిద్వితీ
యమై వచ్చుచున్నది. కార్యసాధనమునకై కాసంత పూర్వవైర
మును బోగొట్ట యత్నించెద. (ఎదురుగ నేగును.)

(పార్వతియు తమాలయు ప్రవేశింతురు.)

గంగ:—(అంజలించి) ఆర్యామహాదేవి కనుజ గంగ స్వాగత మర్పించు
కొనుచున్నది.

పార్వ:—(అసూయతో చూచి మిన్నకుండును.)

గంగ:—ఆ వేమావినీడ నిసుకతిన్నె నాసనముగ నంగీకరించి యాతిథ్య
మును స్వీకరింపుము.

పార్వ:—(తమాలతో) ఆనందముతో నమగవాహిని యర్పించునాతిథ్య మామోదించుట కిది యదనుకా దని చెప్పవేమే తమాలా?

తమా:—ఓ నమ్మా! ఔను. మనము వచ్చినపని యేమి? మార్గమధ్యమున నీ మనుగుడుపు లేమి?

గంగ:—(దీనముగా) అక్కా! ఆనాడు తెలియక యాచరించిన యవినయభావముల కిది ఫలితమా? సోదరిని క్షమించి గతమంతయు మఱచిపోవా?

పార్వ:—క్షమించుటకు నే నెంతటిదానను? అందులకే కా బోలు యానాటి పగ సంతరంగమున నిడుకొనియే కాదా యీనాడు చమత్కారముగ నా నాయకు నాకర్షించుకొని కంటబడకుండ జేసి దాగిలిమూత లాడుచున్నావు.

గంగ:—(తెల్లవోయి) నీనాథుని నేను రప్పించి దాచియుంటినా? అటులు చేసితి నని నీబుద్ధికి నిక్కముగ దోచినదా?

తమా:—దేవీ! మనబంగారము మంచిదైన నగసాలివాని నాడిపోయు టెందులకు?

గంగ:—అయ్యయో! నిష్కారణముగ నీనిరాపనిందను నాతల బెట్టుచున్నారా? ఇది మీకు న్యాయమా! నే నీవిషయమున నావంతైన నెఱుగుదునా? నామాటలు విశ్వసింపరా!

తమా:—(రహస్యముగ) దేవీ! ఈ నంగినంగిమాటలలో, నీ నక్కవినయములో నీచేతుల నలువుకొనుటలో నీమె నైజమంతయు నద్దము గట్టినట్లు తేటబడుట లేదా?

పార్వ:—(ఆలోచించి) ఔను, కాని తమాలా! నాకాంతు డీగయ్యాళి చెంతనుండి యీవలకు వచ్చువఱకును గాసంత శాంతించి కార్యార్థులము గావున గంగతో తాత్కాలికముగ సఖ్యము నెరపుట వివేక మేమో—

తమా:—కొమ్మ గొడ్డలిలో దూటినపుడు వనమున కంతకును చేటు గాక యేమున్నది? కానిమ్ము. అయ్యగారి నాకాశగంగ కొంగున ముడివైచుకొని కులుకుచున్నది. మన మీావిధముగ మతిమాలి- మార్గాంతరము లేక- మాటలాడరానిదానితో మాటలాడి, మానాభిమానముల జంపుకొని, బతిమాలవలసినగతి పట్టినది.

గంగ:—అక్కా! నీ చరణము లంటి శపథము చేయుచున్నాను. కైలాస నాథు డీప్రాంతమున కాలిడనే లేదు. నాపలుకుల నమ్ముము.

తమా:—(మెల్లగ) ఇంతటితో విడిచినది. నెత్తికొట్టి ప్రమాణము జేసెద ననలేదు.

పార్వ:—(దైన్యముగ) మందాకినీ! మా మనసు మిగుల క్షోభించి యున్నది. నా మోము జూచి యొక్కమాట చెప్పుము. దాపరికము వలదు. నానాథు డిటకు రాలేదా? నీచెంత నుండలేదా? లేదా?

(నేపథ్యమున) ఆగు! జగన్మోహినీ! ఆగుము. ఆయాసపడకుము.

పార్వ:—(సంభ్రమించి) వింటివా! తమాలా! వింటివా! ఆ కంఠరవము మీాయయ్యగారిది కాదటే?

తమా:—నేను తిన్నగ నాలకింపలే దమ్మా!

(అంత మోహినీశంకరులు ప్రవేశింతురు.)

(గంగా పార్వతీ తమాల లొకవంక కొదిగి నిలుతురు.)

శంక:—ఆగు, జగన్మోహినీ! ఆగుము. ఆయాసపడకుము. ఈ కారెం డలో కాలినయినుకలో నీపదరాజీవములు కూరుకొనిపోయి పొక్కు లెక్కగలవు. ఆచెట్టునీడ నించుకతడ వాగి, యాయాసమును దీర్చు కొనుము.

మోహి:—(చెట్టు నానుకొని నిలిచి) అబ్బా! ఎచటి కేగిన నచటనే యీా భ్రమరేశ్వరుడు వెన్నంటి వచ్చి బాధించుచున్నాడే!

ఉ. అమ్మక చెల్ల! యందముల కాకరమై జిగిమీరు ముద్దులే
గొమ్మను గాంచి నెమ్మదిని కోరిక లీరిక లెత్త నేమిరో
కమ్మనిరాగలీల లోలుకన్ దిరుగన్, హృదయం బొసంగె నిన్
నమ్మి స్థిరుండ వంచు నళినాయక! నీగుణ మేల మానురా!

శంక:—మోహినీ! నాజగన్మోహినీ! నీయిచ్చవచ్చినటులు నిందింపుము. భ్రమరకోపాలంభన మెందులకు? ప్రత్యక్షముగ శంకరోపాలంభనమే యారంభింపరాదా? తేనియ లొలుకు నీపలుకు లాలించి చిలుకలు సిగ్గుపడవలయునుగాని నా కేమి? కానిమ్ము.

మోహి:—(వినిపించుకొననటు నటించి)

చ. జిలిబిలిముద్దుమాటల రుచిం జవిచూపుచు మాటిమాటికిన్
కులుకుచు చుట్టి తిమ్మరుటకున్ మధుపా! విసువున్ విరామమున్
గలుగుట లేదె? నా వ్రతము గంగను గల్పుచు? నిన్ను గూడినన్
నిలుకడ యేది రా? మఱి యనేకములం దడుమంగ మానుదే?

శంక:—నామాట నమ్ముము. మోహినీ! నన్ను విశ్వసింపుము. నీచరణరాజీవము లంటి శపథము చేసెదను. నిను నిమిషమైన నెడబాసి యుండువాడను గాను. నాకది సాధ్యమును గాదు. (సమీపించును.)

మోహి:—(మాలికతో బరిహరించి) కాముకుల శపథములు నీటిపై వ్రాతలు, మీసాలపై దేనియలును పో పొమ్ము. నీ మాయలలో బడి మానము నర్పించు మందభాగినిని గాను. (నగుచు పరుగిడును.)

శంక:—అయ్యో! ఎంత నిర్దయ- ఎంత కాఠిన్యము! నాకనుల చీకటు లలముకొనుచున్నవి. ఒడలు తూలుచున్నది. జీవితేశ్వరీ! పట్టుకొనుము నన్ను రక్షింపుము. హా! హా! (మూర్ఛిల్లును.)

పార్వ:—(సంభ్రమముతో చేరి) అయ్యో! అయ్యో! రావే. రావే. తమాలా! ఇం కేమున్నదే, నాపాణిపదము- నా కష్టార్జితము- నా తపఃఫలము- నాయాత్మ- చూడవే. ఎట్టి దురవస్థకు లోనైనదో.

తమా:—దేవీ! దేవీ! గట్టిగ విలపించి కలఁగియున్న కాంతుని మనసును మఱింతపాడు సేయకుము. ఈక్రొత్త వన్నెచిన్నెల తెక్కలిపట్టు పురుగు మన కెక్కడ దాపురించె దమ్మా!

గంగ:—అక్కా! ఆపత్సముయము గావున నభవదేవునకు నేనుగూడ కాసంతసేవ జేయ ననుమతించెదవా!

పార్వ:—అంతకంటె నున్నదా? గగనవాహినీ! రా. రమ్ము. నిన్న న్యాయముగ ననుమానించి యలయించినందులకు విచారముగ నున్నది. తమాలా! ప్రాణేశ్వరుని శిరమును నాతొడపై నిడుకొని చేలాంచలముచే నింమకి విసరుచు నుందును. నీవు త్వరితగతి నరిగి పద్మపత్రపుటమున జలమును గొని తెమ్ము. ఊఁ. పో వేమే?

తమా:—(ఆశ్చర్యముతో) అమ్మా! అమ్మా! అటుచూడుము. ఎంత విచిత్రముగ జలప్రవాహ మంతర్ధాన మందినదో.

పార్వ:—చెల్లెలా! మందాకినీ! పరిహాసముల కిది సమయమా? నన్నిటు లేడిపించెదవా?

గంగ:—(తలవాల్చి మిన్నకుండును.)

పార్వ:—(నడిగా) గంగా! గంగా! నాప్రార్థన మంగీకరింపవా? నా నాథుని బ్రదికింపవా? అయ్యో! అయ్యో! అటు తల వంచుకొనెద వేమి? మాటలాడ వేమి? దయ లేదా? జాలి లేదా? వెనుకటికోప మింకను శమింపలేదా? అమ్మా! నాకోరిక చెల్లింపు. చిన్నదాన నైనను నీపాదముల బట్టుకొని బతిమాలుకొనుచున్నదానను. అనుగ్రహింపుము. పుడిసెడు జల మొసగి పున్నెము గట్టుకొనుము. నీకు నాసకలైశ్వర్య మొసంగెదను. కోరినవరము లొసగెదను. అడిగినదెల్ల నర్పించెదను. ఆజన్మాంతమును దాసినై సేవించెదను. నన్నీకష్టమునుండి గట్టున బడ వేయుము. వినవా? నామాట వినవా?

గంగా:—అక్కా! ఈస్వల్పమున కింతగ యాచింపవలయునా? పరమేశ్వరుడే నాకనుగ్రహించిన నాజీవనమును పరమేశ్వరార్పణము గావించుటకు వెనుదీయుదునా ?

పార్వ:—ఏదీ. ఏదీ. చెల్లెలా! మాటలతో గాలము గడపి మహాదేవునకు మఱింతప్రమాదమును గూర్పవలదు. లెమ్మా. ప్రసన్నురాలవై -

శంక:—(కదలి నీరము తెమ్మని చేతితో సంజ్ఞ చేయును.)

పార్వ:—అడిగినమాత్రాన నర్థశరీర మొసగినమహాదాత కొకదోసెడు నీరము దెచ్చి యొసగజాలని నా బ్రదుకేల? అయ్యో! గంగా! పెదవు లెండి నోట మాటరాక నోరు తెఱచి సంజ్ఞామాత్రమున నేరీతి నీరము నడుగుచుండిరో చూడు.

గంగ:—(చెంత గూర్చుండి మోము నిమురుచు) అక్కా! జటాజూటము చెదరి ముఖమండల మాక్రమించినది. ఇంచుక సరదెదను. గాలి చక్కగ ప్రసరించి గాఢమూర్ఛను తొలగింపగలదు.

తమా:—దేవీ! దేవీ! ఎప్పటియట్ల నీరు నదిలో నిండార ప్రవహించు చున్నది. (అని పరుగిడును.)

శంక:—(లేచి) "మోహినీ" "మోహినీ"

పార్వ:—ఇంచుక సేద దీర్చుకొనుడు.

శంక:—(లేచి) ఏదీ- నామోహిని యేదీ! (అనుచు బరుగిడిపోవును.)

పార్వ:—అయ్యయ్యో! మందాకినీ! ఈమోహిని యెచటినుండి దాపురించినదో- తిరుగనిచ్చి యెత్తించినదే! ఇపు డేమిదారి ?

గంగ:—(తెల్లవోయి) అదిగో- అదిగో- మాయావిని మోహిని. ఇంతవర కీప్రాంతముననే దాగి యిపు డీశ్వరు నాకర్షించుకొనుచు ముందుగ బరుగిడుచున్నది. అంతటి మహాత్ముడును మంత్రముగ్ధుడు వోలె పరవశుడై బరువిడుచున్నాడు. రండు. రండు. మనమును వారి ననుసరింతము.

(అందఱును నిష్క్రమింతురు.)

———

ప్రదేశము:—గంగాతీరము.

ప్రవేశము:—భృంగి.

భృంగి:—క్షీరపారావారమును దేవాసురులు మథించినారు- నేను దానితీరమెల్ల దిరిగినాడను. అమృత మమరకోటికి లభించినది. నాకు మహాప్రయాసము శేషించినది. అసురుల కమృతము లభింపని యటులే నాకు శివదర్శనము లభింపలేదు. చూడనిచోటు జూచితిని త్రొక్కనిభూమి ద్రొక్కితిని. కాసంత ... కాసంత యేమికర్మము గంపంతయనుమానము గలవాడ నౌటచే గగనగంగాతీరమున గూడ గలయ వెదకితిని. కాత్యాయనీదేవిని గూడి గంగమ్మయు గంగవెట్టియెత్తినట్లు గడియక్రిందటనే భూలోకముదెసకు బరువెత్తుచు పోయినటులు గంగ చెలికత్తెయే చెప్పినది. నాకేమియును దోచుట లేదు. గౌరీగంగాదేవుల కలహములనడుమ బడి నలిగి నలిగి—మతి చలించి,మా మహాదేవుడు మతిమొకతావునకు బోయి యుండవచ్చును. ఆయన నన్వేషింప దేవేరు లిరువురును దేవులాడుచు బోవుచున్నారు గాబోలును! గంగాగౌరీదేవులకు కలహమే గలిగినచో గట్టగట్టుకొని యిరువురును పోవుదురా?

(అంత మోహిని పరుగున వచ్చి భృంగిసమీపమునుండి పోవును)

భృంగి:—(తేరిపార జూచి) ఎవ్వ రీదివ్యమంగళవిగ్రహము! ఈమె నెవ్వరో తరుముకొనుచు వచ్చుచున్నటు లున్నది. ఈపొదమాటున నించుక డాగి యా యపూర్వరసికుని జూచెదగాక (దాగును)

శంకరుడు:—(ప్రవేశించి చూచి) మాయలాడీ! దొరకితివి. ఇంకెక్కడకు పోగలవు? (అని పొదమాటున నున్నభృంగిని కౌగిలించుకొనును)

భృంగి—దేవా! దేవా! నేను- భృంగిని- నీచరణదాసుడను. ఇది యేమి ప్రారబ్ధ మయ్యా! ఈరీతి మారిపోయితివి.

త్రైత్రైక ముదాహరతి సూర్యరాయమహీనాథేతి. పూర్వార్ధే ధనంజయవ దర్జున ఇవ ధురంధరతేతి తస్య సంబుద్ధిః. ఉత్తరార్ధే ధనం దిశతాత్ దిశ జయ ధురంజయసంపత్తిం ధర వహస్వ. ఏవ మన్యేపి భేదా స్త్వన్యతో ద్రష్టవ్యాః. అత్ర ద్వితీయపాదస్య చతుర్థపాదే యమునా త్సందష్టయమకం నామ యమకభేద ఇత్యవగంతవ్యమ్.

చిత్రాలంకార స్వరూప నిరూపణమ్.

శ్లో॥ పద్మాద్యాకార మాపన్నా వర్ణా శ్చిత్ర ముదాహృతం.

పద్మాద్యాకారతయా రేఖోపరేఖానిష్ఠత్వా త్కథ మస్య శబ్దాలంకార తేతిచే దుచ్యతే. వర్ణానుమాపక రేఖానిష్ఠానా మేవాకారాణా మనుమేయనిష్ఠత్వాధ్యవసాయా దౌపచారికేయం శబ్దాలంకార తేతి రూఢోక్తికోయం వ్యవహారః.

స్వగహితవ్యంజనావృత్తిమత్త్వసాధర్మ్యా చ్చిత్రాలంకారనిరూపణం ప్రతిజానీతే పద్మాద్యాకార మితి. ఆదిశబ్దేన హలబంధాదయో గృహ్యంతే. నన్వశబ్దాత్మక రేఖాదిగత స్యాకారచిత్రస్య కథం శబ్దాలంకారతేత్యా శంకసమాధత్తే పద్మాద్యాకారతాయా ఇతి. అశబ్దాత్మకే ష్వపి రేఖాదిషు గమ్యగమకయో రభేదోపచారా త్తథా వ్యవహార ఇతి బోధ్యం. అత ఏవ కర్ణికాదిస్థానేషు వర్ణానాం పౌనరుక్త్యాపత్తేః పౌనరుక్త్యాలంకారానంతర్యం చ ద్రష్టవ్యమ్.

## అష్ట దళ పద్మ బంధః

తత్రాష్టదళపద్మబంధ ముదాహరతి భాసత ఇతి.లక్షణంతు "కర్ణికాది లిఖే ద్వర్ణాన్ క్రమా ద్దిక్షు విదిక్షు చ సకర్ణికాన్ సప్రదిక్షు విదిక్షు తు వికర్ణికాన్". ప్రవేశనిర్గమాభ్యాం తు దిక్షు తేష్వ శ్చతుర్దశవ్యవస్థా నేన తా నాద్యే దళేష్వత్రత్యేనంతరా నితి కేచిత్తు సకలేషు

చ పాదేషు య ద్యాద్యంతాక్షరేక తా గతాగతానుకూల్యేన వ్యస్తే యే షష్ఠసప్తమే తే ద్వితీయతృతీయాభ్యా మభిన్నే చరణాంతరే తదా చతురరం చక్రమష్టపత్త్రాంబుజాదివ దితి తత్ప్రకారో న్యసే దేకం ద్వే ద్వే దిక్షు విదిక్షుచ ప్రవేశనిర్గమౌ. దిక్షు కుర్యా దష్టదళాంబుజ ఇతి కర్ణికాయుక్త మష్టదళపద్మం లిఖిత్వా కర్ణికాయాం ప్రథమాక్షర మష్టసు దళేషు ద్వితీయాక్షర మారభ్య ద్వే ద్వే అక్షరే విన్యసేత్. తత్ర త్రిషు దళేషు కర్ణికాక్షరప్రవేశనిర్గమాభ్యాం ప్రథమదిగ్దళైకాక్షరప్రవేశేన శ్లోకసమాప్తి ర్భవతీతి తదాశయః భాసతే. నవ్యభూషాభా భాషాభూషణసారభా భారసౌమ్యతమశ్రీభా భా శ్రీమహిత తేసభా ఇతి పదచ్ఛేదః. భాషావాక్ భూషణ మలంకారో యస్య సః వాగ్భూషణం భూషణ మితిన్యాయా త్సర్వేభ్యోపి భూషణేభ్యో వాగ్భూషణ మేవ మహా దితి వ్యజ్యతే. భారేణ భూ భారేణ సౌమ్యతమః భయా నామైకదేశగ్రహణా న్నామగ్రహణ మితిన్యాయేన భాగత్యా శ్రియా లక్ష్మ్యా చ మహితః తేషాం సంబుద్ధిః. హే సూర్యరాయసార్వభౌ మేతి శేషః. తే సభా నవ్యభూషాభి ర్భాసత ఇతి తథోక్తా. సౌరైః కవిభి ర్భాసత ఇతి తథోక్తా. శ్రియో వేదాః ఋచస్సామాని యజూగ్ంషి సాహిత్రీ రితి శ్రుతేః. తాభి ర్భాసత ఇతి తథోక్తా. ఏవంవిధా సతీ భాసతీ ప్రకాశతే.అత్ర లక్షణోదాహరణాభ్యా మాకారోల్లేఖనస్య దుర్బోధా దాకారోదాహరణప్రదర్శనేన ప్రేక్షావతాం సుఖబోధో జాయతేతరా మితి తత్తదాకారోల్లేఖనం కృత మిత్యవగంతవ్యమ్.

## హలబంధః

హలబంధ ముదాహరతి శూరేతి. లక్షణం తు హలవాలయుగశ్లిష్టో హలబంధోఽభిధీయతే ఏతదుద్ధార స్తు ఈషాదండస్య ముఖేవాలః

తతో లాంగలః అగ్రే యుగశ్చ ఏతై ర్వ్యక్త ఈషాదండో హాలబంధః ఈషాదండముఖాగ్రఘటితవాలస్య ముఖ మారభ్య క్రమా ద్బహిర్ద్వివమా క్షరాన్విలిత్ మధ్యేసమ మేకం విలిఖ్యతతో ప్యేకం విషమ మీషాదండే విలిఖేత్. తతో హాలే కర్ణేష మావిలిఖ్య ముఖే నవమ మేక మక్షరం విలిఖ్య తదారభ్య అనులోమేన కర్ణికాక్షరేణ సహ వర్ణత్రయం విలిఖ్య తతః ప్రతిలోమగత్యా కర్ణికాంతం విలిఖ్య తత ఈషాదండే షోడశవర్ణేన సమాపయేత్. తదాదిత శ్శిష్టం లిఖిత్వా వాలకద్వ్యపి విలిఖేత్. శూరవీరవరస్ఫారకరవాలవారధే సూర్యరాయమహీపాల విజేతా జేతా అవతా వతా ఇతి పదచ్ఛేదః. శూరో మానవాన్ యద్వా సశయో రభేదసశోభన మురం వక్షో యస్య సః. మహా పురుషవిలక్షణ మేతత్ ఉరశ్చోర మితి. సారస్వతవిలాసే వీరవరో వీరాగ్రేసరవిస్ఫారః ప్రకాశమానః కరవాలో యస్య సః యద్వార లయో రభేదేన స్ఫారః ప్రవృద్ధః కరవారో బలిసమూహో యస్య సః. "బలిహస్తాంశవకరా" ఇత్యమరః లస్త్యాగః తేన వారధి స్సముద్రః లః పుంసి శక్రే త్యాగే చ వార్ధి ర్వారిధివారధీ ఇతి చ శబ్దమహో దధా తేషాం సంబుద్ధిః. హే సూర్యరాయమహీపాల త్వ మితి శేషః. త్రాతా అభీతసంరక్షకః జేతా అహితశిక్షకః తావతా తావన్మాత్రేణ న తు మయి యాదృశవిద్యాతిశయో పీతి భావః. అవరక్ష.

## షోడశదళ పద్మబంధః

షోడశదళపద్మబంధ ముదాహరతి సఖేతి. ఉద్ధారిస్తు ఏకం సర్వాం యది భవే దేకాంతరిత మక్షరం తత్షోడశదళం పద్మం శిష్టాగ్రా ధారకర్ణికం సఖాసరససంసక్తా సదా సత్యసహో అసమా స మేతి వా సర్వాసర్వాంసహా స్తుత సదాసక్తసతాం సఖ ఇతి పదచ్ఛేదః. సర్వ

సర్వాం సహాయా స్వమస్తభూమేః సత్రే సదాసక్తః. యద్వా తస్యా ఆసత్రే ఆదానే సదాసక్తః సకలశత్రూన్ జిత్వా తదీయరాజ్యమండలాక్రమణోత్సుక ఇత్యర్థః. సత్రే మాచ్ఛాదనే యజ్ఞే సదాదానే వనేఽపిచే త్యమరః. సతాం పండితానాం సఖా సతాం సఖ ఇత్యలుక్సమాసః. తేషాం సంబుద్ధిః హే! సూర్యరాయసార్వభౌమ తిదేతి శేషః. సభాసరససంసక్తా సదాజ్ఞానబోధనీత్యర్థః. "సంక్లీబే స్యందన పదే జ్ఞానే ధ్యానే నివారణే" ఇతి రత్నమాలాయాం. సత్యమేవ సహత ఇతి సత్యసహా సత్యే సర్వం ప్రతిష్ఠితం తస్మాత్సత్యం పరమం వదంతీతి శ్రుతేః. అసమా నిస్తులా యద్వా సమా శోభాయుక్తా.

## చతురరచక్రబంధః

చతురరరచక్రబంధ ముదాహరతి భాసత ఇతి. లక్షణం తు సకలేషు చపాదేషు యద్యాద్యంతాక్షరైః కతా గతా గతానుకూల్యేన న్యస్తేఽ షష్ఠసప్తమే తే ద్వితీయతృతీయాభ్యా మభిన్నే చరణాంతరే తదా చతురరం చక్రి మష్టపర్ణాంబుజాదివ దిత్యాదిప్రోక్తం వ్యాఖ్యాతమేతత్.

## ద్విచతుష్కచక్రబంధః

ద్విచతుష్కచక్రబంధ ముదాహరతి సూర్యరాయేతి. లక్షణం తు "బహిరంతర్మండలస్థం తావత్కోష్ఠవిహారి యత్ కోష్ఠాష్టకయుతం తద్ద్విచతుష్కం చక్రముచ్యతే". అత్రాయుగ్మాక్షరశ్లిష్టా యది గోమూత్రికా భవేత్. అనులోమ్యేన రచితా దుష్కరే ప్రియ ముచ్యతే.

# సంపాదకీయము

## విజ్ఞప్తి.

ఈ కీలక సం॥రం చైత్రవైశాఖమాస ప్రథమ సంచిక వైశాఖాంతము గాకుండగనే పాఠకులకు బంపవలసియున్నవి. కాని రెండుక నెలనుండి కాగితము లీ నగరిలోగాని పరిసరపట్టణములందు గాని లేకుండుటచే నింతదనుక బంప వీలు చిక్కినదికాదు.

ఇటుపై సకాలమున బంపబడు నని విజ్ఞప్తి గావించుచుంటిమి.

సంపాదకుఁడు

కాశరవర్తి కృష్ణశాస్త్రి.

సంపాదకసహాయులు :

1. దంతులూరి సుబ్బరాజు
(ఎం. ఏ.)
2. గున్నేపల్లి అక్షయలింగకవి
(విద్వాన్)